

# BOMBAY TILES

In 10 shades.

## కథలు

25-1-85న ముచ్చెర్ల అరుణ ముఖచిత్రముతో వెలువడిన మా (మీ) పత్రిక ఎంతో సుందరముగా వుంది. "ఇది ఈ దేశము" కథా రచయిత్రి రావినూతల సువర్ణాకన్నన్ అభినందనీయులు.

గోలి అప్పలరాజు, తగరపువల్స

● ● ●

"అరుణ" ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో "అందరూ ఆలోచించండి" కథ బాగుంది. కన్న తల్లికంటే, కట్టుకున్న పెళ్లామే ఎక్కువ అనుకునే వారికి, తమ ఇద్దరికి మధ్య తల్లి అడ్డం అనుకునే మనస్తత్వం వున్నవాళ్లకి ఈ కథ, గుణపాఠం కాగలదు.

జిట్టా రమణీమోహన్, కడప

● ● ●

నటి అరుణగారి ముఖచిత్రంతో వెలువడిన పత్రికలోని కథలన్నీ చాలా బావున్నాయి. ఒకదాని కొకటి పోటీపడుతున్నాయి. "అందరూ ఆలోచించండి" "ఇదీ ఈ దేశం" కథలు మా ఇంటిల్లిపాదినీ అలరించాయి.

డి. గిరిధర్‌రెడ్డి, డి. నరేంద్రరెడ్డి, నెల్లూరు

## గట్టిభావం

తేది 25-31 జనవరి 85 సంచికలో "పైసా!" అనే చిట్టి కవితలో గట్టిభావం దాగుంది.

కె. రవి. ఆర్. వనజ, హైదరాబాదు

## లోతుపాతులుతెలుసుకోవాలి

కె. గోదావరిశర్మ గారి "స్థాన బలిమి" కథలో మంచి నీతి ఉన్నా, రచయిత రైల్వే పూర్వాపరాలు సేకరించి




వ్రాస్తే ఇంకా బాగుండేది జగన్నాథరావు లాటి కొందరిని లంచగొండులుగా మార్చిందెవరు? మనమే! కథలో రైల్వే మేనేజరుకు, కంప్లయింటు చేసినట్లు అది బుట్టదాఖలు అయినట్లు వ్రాశారు. కాని ప్రస్తుత నిబంధనల ప్రకారం ఇలాంటి కంప్లయింట్లను రైల్వేశాఖ క్షుణ్ణంగా పరిశీలించి అవసరమయిన అంటా (కథలో జరిగినట్లు) కంప్లయింట్లకు విచారణ అనిపెట్టి నేరం ఋజువయిన పక్షంలో సదరు ఉద్యోగిపై నిబంధనల ప్రకారం తీవ్రమయిన చర్య తీసుకొనడం జరుగుతుంది.

అందుచేత శ్రీ శర్మగారు ఒక డిపార్టుమెంటును గూర్చి వ్రాసేటప్పుడు దాని లోతుపాతులు బాగా తెల్సుకొని వ్రాస్తే ఇక ముందు, బాగుంటుందేమో!

ఎ. కామేశ్వరరావు, స్టేషన్ సూపరింటెండెంటు, ఖరగ్‌పూర్

## అచ్చు పొరపాటు

చిరంజీవి, మాధవి ముఖ చిత్రం ఆకర్షణీయంగా వుంది కథలలో 'లిఫ్ట్' కథ పరవాలేదు. అందులో చిన్న అచ్చు తప్పు దొర్లింది. మొదటి కాలములో పన్నెండవ పేరా చివర "ఆమె భుజమునకు" బదులు 'ఆమె భోజనానికి' అని పడింది. గమనించగలరు.

దుర్గం ముస్తఫా, దామల్ చెరువు

★ అచ్చు పొరపాటుకి చింతిస్తున్నాము. సం. □




**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

(1938 - 1972)

శుక్రవారం : 1-7 మార్చి, '85

శ్రీ రక్తాక్షినామ సం. ఫాల్గుణ శు. నవమి

సంపుటము 77 : సంచిక 26

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడిప్రతి వెల | రు. 2-00 |
| ఆరు మాసాల చందా | రు. 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
"బుల్లెట్"లో సుహాసిని


**కథలు :**

మండుటెండలో మంచుబొమ్మలు ...18
ఇది కర్మభూమి ...54

**సీరియల్ నవలలు :**

రాగసంధ్య ...10
ప్రేమించవే మనసా... (ప్రారంభం) 28
పసిడిబొమ్మ ...46
మౌనవిపంచి ...58

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు—4, న్యూఢిల్లీ లేఖ—6, వ్యక్తిగీతం, వారఫలం—16, మంగళ ప్రదమైన మంగళగిరి—24, సినిమా విశేషాలు—37, డాక్టర్ సలహాలు—52, ఇ'వేమన' పద్యాలు—56, ధర్మపథం, అవీ, ఇవీ, అన్నీ —64, హైదరాబాద్ నోట్‌బుక్—66.

# కొత్తది! 70 సెకన్లలో రుజువు

విడుదలచేస్తుంది మీ

# పూర్తి శక్తిని పూర్తి బలాన్ని

వేలాది పురుషులు ప్రపంచమంతటా అద్భుతమైన ఫలితాలను సాధించారు. ఇప్పుడు మీరు ఉచితంగా ఏ నష్టమూ లేకుండా ప్రపంచంలో అత్యంత పరీక్షకు లోనయిన, విజయవంతమైన శక్తి, కండరాలనూ పెంపొందించే పద్ధతిని పరీక్షించే అవకాశం. రోజుకు 70 సెకన్ల అపూర్వమైన ఐసోటోనిక్/ఐసోమెట్రిక్ కంట్రాక్షన్ కార్యక్రమం. శక్తి విడుదల చేసేందుకు రుజువైన పద్ధతి మీరు ఎప్పుడూ కలలుకనే అపూర్వ శరీర సౌష్టవాన్ని తీర్చి దిద్దుతుంది!



- కండరాలు పొంగిన విజయవంతమైన అద్భుతమైన రూపాన్ని తీర్చిదిద్దుకోండి. అమ్మాయిలు మెచ్చే అందమైన, లోతైన ఛాతీని.
- బుజాలపై ముద్దను వదిలించుకుని శక్తి గల కండను పెంచండి.
- కొవ్వుతో కూడిన రాతువులను వదిలించుకోండి. అద్భుతమైన బుల్‌వర్కర్-3 వారి శక్తితో కూడిన మెడను, ఉడుకుదనం చిందించే గట్టి వీపుని రూపొందించుకోండి.
- మీ శరీరాన్నంతటిని పునర్నిర్మించుకోండి. గాలి బాగా పీల్చండి. మీ 500 ల కండరాలలో 300 పై పని చేయించండి. శక్తిని తిరిగి ఉత్పత్తి చేయండి. మీ పూర్తి శక్తిని విడుదల చేయండి. మీలో గల అద్భుతమైన వ్యక్తిని బయటకు రానివ్వండి.

**ఉచితంగా దీన్ని 14 రోజులు ఇంట్లో వాడి రుజువు చేసుకోండి.**

## రోజు 1 — శక్తి ప్రారంభం కానివ్వండి!



మీరు మీ ఐసోటోనిక్/ఐసోమెట్రిక్ కార్యక్రమాన్ని మొదలెట్టిన క్షణం నుంచి మీలో హాయిగా వున్న అనుభూతి — మీ విజయానికి మార్గం అన్నమాట! ఒక్కొక్కదానికి 6-8 సెకన్లు పట్టే అద్భుతమైన 'రిలీజర్ల' శ్రేణితో నిర్మించుకుంటారు కొత్త రూపాన్ని మీరు.

## రోజు 2



ఎంత మంచిగా వుందో చూడండి! జీవాన్నిచ్చే ప్రాణ వాయువు మీ శరీరమంతా విస్తరిస్తున్న వ్యాపిస్తున్న అనుభూతి చురుకైన 7 రిలీజర్లు మీలో అంతర్నిహితమైన శక్తిని విడుదల చేయడం మొదలెట్టారు.

## రోజు 3



సాటిలేని పవర్ మీటర్‌ని మీరు నమ్మలేరు. మీ బలం పెంపొందుతోంది. రిలీజర్ 5 ప్రభావం మీ బుజాలపై ఎలా అల్లా అనుభూతి ఇస్తుందో చూడండి చక్కలాంటి బలంతో అవి ఉప్పొంగుతాయి.

## రోజు 4



రిలీజర్ 4 ఎలా పెరిగిన మీ పొట్టను తగ్గించి, చక్కగా సన్నగా రూపాన్ని కలిగిస్తుంది!

## రోజు 5



మీరు మరింత బలంగా రూపొందుతున్నారు. అయినా మీరు విడుదల చేసింది, మీ పూర్తి శక్తిలో కొంత మాత్రమే. రిలీజర్లు 1 మరియు 2 మీపై శరీరాన్ని తీర్చిదిద్ది అందమైన కండరాలు పెరిగిన రూపాన్ని — మీరెప్పుడూ కావాలనుకునే విజయవంతమైన రూపాన్ని రూపొందిస్తాయో అనుభవంతో తెలుసుకోండి.

## రోజు 6



పవర్ మీటర్‌తో చూసుకోండి — ఓహో! ఈ అద్భుతమైన 'రిలీజర్ల' కోసం వెచ్చించేకాలం కేవలం ఒక్కొక్కదానికి 6-8 సెకన్లు అయితే ఈ 'శక్తి విడుదలలు' మీకు ఎక్కువలో ఎక్కువ ఫలితాలనిస్తాయి.

## అభినందనలు! రోజు 7



మీలో తేడాని మీ అద్దం చూపిస్తూనే వుంది. మీకు మరింత బలం వచ్చిన అనుభూతి — శక్తి కలిగిన అనుభూతి. మీలో మీకు మరింత నమ్మకం మరింత హాయిగా ఊపిరి పీలుస్తారు. అయితే ఇది ఒక గొప్ప ప్రారంభం మాత్రమే. కండరాలు మరియు శక్తి 'రిలీజర్ల' అద్భుతమైన కొత్త బట్టలో బాగుంగా మీరు రూపొందుతున్నారన్నమాట!

## 50% దాకా ఎక్కువగా శక్తి

కేవలం 14 రోజుల్లో

మీకు పెద్దగా తేడా కనిపించకపోయినా...

ఏదో పెద్ద తేడా వుందని తెలుసుకుంటారు.

## మీకిందుకయే ఖర్చేమీ లేదు

**ఇదే మా సవాలు!**

మీరు పరిపూర్ణ మానవులేనా? మీ పూర్తి శక్తి విడుదల చేసుకోవాలనుకుంటున్నారా? మీరు మరింత దృఢంగా, ధాటీగా, మరింత ధీమాగా వున్నట్లు అనిపించకపోతే, కనిపించకపోతే అన్నిటినీ తిరిగిచ్చేసి ధరను పూర్తిగా (పోస్టేజి, పంపేందుకయిన ఖర్చులు మినహాయించుకుని) తిరిగి రాబట్టుకోండి...ఏ ప్రశ్న వేయించుకోకుండా.

ఐసోటోనిక్/ఐసోమెట్రిక్ కార్యక్రమాన్నీ, బుల్‌వర్కర్-3 ని పూర్తిగా 14 రోజులపాటు ఏ నష్టమూ లేకుండా ఉపయోగించి చూడండి.

సాటిలేని పవర్ మీటర్
మీ కండరాల శక్తిని కొలుస్తుంది
అలా పెరుగుతూ పెరుగుతూ ఉండగా!

రూ. 314/- కే. బుల్‌వర్కర్ ప్రైవేట్ లిమిటెడ్, మెహతా మహల్, 15 మేథ్యూ రోడ్, బొంబాయి 400 004 నుండి వి.పి.పి. ద్వారా లభిస్తుంది. ప్రముఖ స్పోర్ట్స్ దుకాణాలనూ, డిపార్టుమెంటల్ స్టోర్సులలో. దొరుకుతుంది.

## ఉచితం

24 పేజీల బొమ్మల ఎక్సర్‌సైజ్ వాల్ ఛార్ట్, పోషణ మరియు తర్ఫీదు గైడ్. మేలైన నాణ్యత గల లెదర్న్ క్యారీయింగ్ కేస్ — మీ బుల్‌వర్కర్-3 కి జీవితకాలం రక్షణకోసం.



## ఇది నిజం!

7 ప్రభావమైన 'రిలీజర్ల'కు పట్టే సమయం — కేవలం ఒక్కొక్కదానికి 6-8 సెకన్లే. అయినా మామూలు పద్ధతులకన్న 4 రెట్లు వేగంగా చురుకుదనాన్ని కండరాల శక్తిని పెంపొందించే వీలు.

**14 రోజులు ఏ నష్టం లేకుండా ఇంట్లో పరీక్ష**

SW-31

బుల్‌వర్కర్ మెహతా మహల్ 15, రోడ్, బొంబాయి 400 004.

నాకు బుల్‌వర్కర్-3 ని వెంటనే పంపండి. 14 రోజుల్లో దీని వలన నాకు పూర్తి సంతృప్తి కలగకపోతే అన్నిటినీ తిరిగిచ్చేసి ధరను (పోస్టేజి, పంపకానికయే ఖర్చులు మినహా) తిరిగి రాబట్టుకోవచ్చని నేను గ్రహించాను. BW-539-TEL

ఉచితమైన గడిలో టిక్ పెట్టండి.

☐ రిజిస్టర్ పోస్ట్ పార్సెల్ ద్వారా పంపండి. నేను బుల్‌వర్కర్ ప్రైవేట్ లిమిటెడ్ పేరున రూ 314 కి డ్రాఫ్ట్/పోస్టల్/మనీ ఆర్డర్ నం................తేదీ................ గలది పంపిస్తున్నాను.

☐ వి.పి.పి. ద్వారా పంపండి. నేను దీన్ని అందుకోగానే పోస్ట్ మ్యాన్‌కి రూ. 314/- చెల్లిస్తానని మాట ఇస్తున్నాను................

పేరు................

ఎడ్రసు................

................

పిన్‌కోడ్................ సంతకం................

# విదేశీ వ్యామోహం-గూఢచారి చర్యలు

గూఢచారి కార్యకలాపాల నిర్వహణ గొప్ప కళేమీ కాదని, అది ప్రభుత్వంలో ఉన్న సగం.మంది పర్సనల్ అసిస్టెంట్‌లు, కనపడ్డ రహస్య పత్రాలన్నిటికీ వరసపెట్టి కాపీలు తీసి చాణక్యపురిలో అందుబాటులో ఉన్న విదేశీ దౌత్య ప్రతినిధికి అంద జేసే ఒక మధ్య తరహా పరిశ్రమలా తయా రైందనిపిస్తున్నది. జేమ్స్‌బాండ్, అగధా క్రిస్టీల ప్రభావంతో పెరిగిన మనవంటి వారికి, ప్రపంచంలో అతి ప్రాచీనమైన వృత్తులలో రెండవ స్థానాన్ని అలంకరించిన ఈ గూఢచారి వృత్తి ఇంత దారుణంగా పతనం కావడంతో, మన భ్రమలన్నీ పటాపంచలై పోయినట్లయింది. అసలు దీని కంతటికీ మూలకారణం ఆధునిక సాంకేతిక పరిజ్ఞానమేనని నా ఉద్దేశ్యం. ప్రధాన మంత్రి కార్యదర్శి, తదితర పెద్ద ప్రభుత్వాధికారుల కార్యాలయాలలో జెరాక్స్ యంత్రాలని అమర్చాలన్న సూచన చేసిన వ్యక్తి ఎవరో అతనే అసలైన గూఢచారని నా నమ్మకం. నేను విన్న దానినిబట్టి ఆ యంత్రాలన్నీ జపాన్‌వే. కానీ ఈ వ్యాపారంలో ·జపాన్ పాత్ర ఏమీ లేకపోవడం ఆశ్చర్యకరమైన విషయం. ఫ్రెంచివారు; అంతటా వ్యాపించి ఉన్నటువంటి అమెరికన్‌లు – వారి సి. ఐ. ఎ., రష్యావారూ – వారి కె. జి. బి., జర్మనీవారు – వారి పోల్స్ అందరికీ దీనితో సంబంధం ఉన్నట్లు బయట పడింది. ఎందు వల్లనో బ్రిటిష్ వారికి ఈ జెరాక్స్ యంత్రాల సంగతి తెలియదులా ఉన్నది. లేక వారికి ఈ రహస్య పత్రాల సేకరణకి మరో మార్గం ఉండి ఉండాలి. మరి ఇటాలియన్‌ల మాటేమిటి? వాళ్ల గురించి ఎన్నికలప్పుడు చాలా విన్నాము. అయితే ఇటాలియన్‌లకి ఉన్న సౌకర్యం మరెవరికీ లేదు. వాళ్లకి ఈ కింది తరగతి పి. ఎ. లు, పర్సనల్ సెక్రటరీల సహాయం అవసరం లేదు.

ఈ హడావిడి వల్ల బయట పడేదేమీ ఉండదని నాకు అనిపిస్తున్నది. గూఢచారి కార్యకలాపాలకిది మొదలూ కాదు, తుదీ కాదు. పండిత నెహ్రూ ప్రభుత్వంలో అన్ని విషయాలూ ఆయన పర్సనల్ అసిస్టెంట్‌గా ఉన్న మత్తయి ద్వారా అమెరికా వారికి అందేవి అన్న విషయం అందరికీ తెలుసు. తర్వాత ఆయనే తన యజమాని గురించి అసభ్యకరమైన రీతిలో ఒక పుస్తకం రాశాడు. నెహ్రూ పరిపాలనలో మత్తయి నిజంగా ఓ యంత్రం వంటివాడు. కానీ అలాంటి అభిప్రాయం నెహ్రూకి మాత్రం ఉండేది కాదు. హిట్లర్ దగ్గర కూడా తర్వాత గూఢచారిగా మారిన సహాయకుడు ఒకడు ఉండేవాడు. విల్లీ బ్రాంట్ జర్మనీకి ఛాన్సలర్‌గా ఉన్న కాలంలో ఆయన దగ్గరా ఇలాంటి వ్యక్తే ఒకడు ఉండేవాడు.

కుమార్ నారాయణ్‌లు, ఖేర్‌లు ఈ పని చేశారో లేదో నాకు సరిగా తెలియదు. నిజంగానే వాళ్లది చేసి ఉంటే కేవలం డబ్బు కోసమే. అలాంటప్పుడు వాళ్లని డబ్బుకి అమ్ముడుపోయే కిరాయి విదేశీ సైనికులవంటి వారనుకోవాలి. కిమ్‌ఫిల్‌బీలు, డొనాల్డ్‌మెక్‌లీన్స్‌లు కూడా గూఢచారులే. అయితే వారు మరో కోవకి చెందిన వాళ్లు. అయినా వాళ్లని గూఢచారి కార్యకలాపాలకోసం వాడుకున్న రష్యావారు కూడా వారినేమీ గౌరవంగా చూడలేదు. ఫిల్‌బీ ఉన్నతస్థాయి గూఢచారి. ఆయన అణుబాంబుకి సంబంధించిన అతి ముఖ్యమైన సమాచారాన్ని రష్యా వారికి అందజేశారు. బ్రిటన్‌కి చెందిన మెక్‌లీన్స్ యుద్ధ కాలంలో అమెరికా రాయబార కార్యాలయంలో రెండవ స్థానంలో ఉన్న వ్యక్తి. యాల్టా పత్రాలనే వాటితో సహా ఆయనకి అన్ని రహస్య పత్రాలూ అందుబాటులో ఉండేవి. వీరిద్దరికీ సంబంధం ఉండవచ్చు, లేకపోవచ్చు కానీ మూడో వ్యక్తి మరొకరు ఉండేవారు. ఆయన పేరు గై బర్జస్. వీరంతా తప్పించుకుపోయి మాస్కోలో కలుసుకున్నారు. వీళ్లు మాస్కో చేరిన తర్వాత మెక్స్‌లీన్స్‌కి ఆయన భార్య విడాకు లిచ్చి ఫిల్‌బీని వివాహం చేసుకున్నదని అంటారు. వృద్ధదంపతులకి కేటాయించే ఒక రకం హాస్టల్‌వంటి ఒక చెత్త హోటల్‌లో రష్యావారు వాళ్లిద్దరికీ నివాసం కల్పించారు. ఫిల్‌బీకి ఒక ప్రచురణ సంస్థలో అనువాదకుడిగా ఉద్యోగం ఇచ్చారు. ఫిల్‌బీ ఇప్పుడు బతికి ఉన్నాడో లేదో తెలియదు కానీ అదంత ముఖ్యం కాదు. ఆయన ఎవరికైతే గూఢచారిగా పనిచేశాడో ఆ రష్యావారే ఆయనని నమ్మలేదు. ఇవాళ ఒక దేశానికి గూఢచారిగా పనిచేసిన వ్యక్తి రేపు మరో దేశానికి చెయ్యడన్న నమ్మకం ఏమిటి? గూఢచారులు వేరు పురుగులకన్నా హీనమైనవారు.




ఈ దేశంలో ఫ్రెంచివారికి ఉన్న ప్రతిష్ఠ పూర్తిగా తుడిచి పెట్టుకుపోయింది. ఇంతవరకూ వాళ్లను కున్నవి అనుకున్నట్లు జరుగుతూనే ఉన్నాయి. ఒకానొక సమయంలో మన విదేశాంగ శాఖ కార్యాలయం వాళ్ల దయా ధర్మాలమీదే ఆధారపడ్డదంటే అతిశయోక్తి కాదు. ఫ్రెంచివారు ఇటాలియన్‌లలాగా గొప్పలు చెప్పుకోరు. శ్రీమతి గాంధీకి వాళ్లమీద ఎంత అభిమానం ఉన్నా ఆ సంగతి వారు పెద్దగా చెప్పుకోలేదు.

ఇక్కడ ఉన్న వాళ్ల రాయబారికి స్వదేశం రాగానే వాళ్ల విదేశాంగశాఖ కార్యాలయంలో ఆయనకి రెండవ స్థానంలోని వ్యక్తిగా ఉన్నత పదవి ఇచ్చారు. అంటే ఆయనేదో కొంత సమాచారాన్ని సేకరించి తీసుకు వెళ్లాడనే అనుకోవాలి. అయితే నా అభిప్రాయం ప్రకారం ఫ్రెంచివారు త్వర త్వరగా లాభాలు చేసుకుందామను కుంటున్నారు. కానీ అది అనుకోకుండా బెడిసికొట్టే ప్రమాదం ఉంటుంది. చేజేతులా ఫ్రెంచి వారు తమ ప్రతిష్ఠని పాడు చేసుకున్నారు. తిరిగి దాన్ని పొందటానికి వారికి ఎన్నో సంవత్సరాలు, బహుశః దశాబ్దాలు కూడా పట్ట వచ్చు.

అమెరికా వారిని చూడండి. ఈ దేశంలో ఎంత మంది సి. ఐ. ఎ. మనుషులు పని చేస్తున్నారో నాకు తెలియదు కానీ ప్రపంచం అంతటా వాళ్లు తమ కార్య కలాపాలని నిర్వహిస్తూనే ఉన్నారు. సర్వ వ్యాప్తమైన వారి హస్తం భారతదేశంలో జరిగే ఎన్నో సంఘటనలలో ఉండి ఉంటుందంటారు. శ్రీమతి గాంధీకి సి. ఐ. ఎ. అంటే ఇష్టం లేదు. నెహ్రూకూడా

**STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS ABOUT NEWSPAPER**

# ANDHRA SACHITRA VARAPATRIKA

FORM IV ( see Rule - 8 )

1. Place of Publication : VIJAYAWADA
2. Periodicity of Publication: WEEKLY
3. Printer's Name . S NageswaraRao
   Whether citizen of India : Yes
   Address : 1, Luz Avenue, Mylapur, Madras-600004
4. Publisher' Name : Sri S. Nageswara Rao,
   Whether Citizen of India : Yes
   Address : 1, Luz Avenue, Mylapur, Madras-600004
5. Editor's Name : S. Radhakrishna
   Whether citizen of India : Yes
   Address : 14-14-21, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3
6. Names and addresses of Individuals who own the news paper and partners or share-holders holding more than one percent of the total capital
   1. Name : S Kamakshmma
      1 Luz Avenue, Mylapur, Madras-600004.
   2. S. Radhakrishna
      Address . 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
   3. Name : S. Nageswara Rao
      Address : 1, Luz Avenue, Mylapur. Madras-600004.
   4. Name : S. Rajeswari
      Address : 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
   5. Name : S. Seshamma
      Address : 1, Luz Avenue, Mylapur, Madrass-600004
   6. Name : S. Sreerammurthy, Trustee. Kasinadhuni Nageswara Rao, Sivalenka Sambhu Prasad Dhrma Nidhi.
      Address : 42-45, Luz Church Road, Madras-600004
   7. Name : S. Ramayamma
      Address : 1, Luz Avenue, Mylapur, Madras-600004.
   8. Name : P. Satyanarayana
      Address : Plot No. 28, Bhagyalakshimi Nagar, (Behind Kalpana Talkies), Hyderabad-500380.
   9. M/s. Sambhu Prasad & Sons P. Ltd.
      63, Rayapettah High Road, Madras - 4
   10. Mr M. S. Kini,
       1-9-1122/3 1, Dayananda Nagar, Hyderabad-4.
   11. Sri Venkata Rao Kordale,
       1-1-593/2, Gandhinagar, Hyderabad-38
   12. Smt. P. Lakshmi Sailaja,
       P.O. Yellamanchili, Visakhapatnam Dist.
   13. Sri V. Sundaram,
       No. 20 First Main Road, Thiruvanmiyar, Madas-41.
   14. Sri R. Gopalakrishna,
       79, Venkateswara Nagar, Kottivakkam, Madras - 41-
   15. Sri S. Sreeramamurthy,
       63, Rayapettah High Road, Madras-4.
   16. Sri P. Ramaswami,
       63, Rayapettah High Road, Madras-4.
   17. Smt. P. V. L. Ratnam,
       Sreenagar Colony, Kakinada, E.G. Dist.
   18. Master S. V. S. Arvind,
       1, Luz Avenue, Madras - 4.
   19. Sri M. S. Ramesh,
       16-11-19/5/2/A, Saleemnagar Colony, Malkpet, Hyderbad - 36.
   20. Smt. P. Nageswaramma,
       1, Luz Avenue, Madras - 4.

I, S. Nageswara Rao here by declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**S. NAGESWARA RAO,**
Signature of Pubisher.

1-3-1985

## న్యూఢిల్లీ లేఖ ......

అలాగే ఉండేవారు. ఈ దేశంలో అమెరికా వాళ్ళ అంత సదభిప్రాయం లేకపోవడానికి ఆ దేశం వాళ్ళే కొంతవరకూ కారణం అని చెప్పక తప్పదు. కిస్సింజర్, నిక్సన్‌లు, అలాగే డల్లెస్, జాన్‌సన్‌లు కూడా దానికి బాధ్యులు. ఏవో కొన్ని కాంట్రాక్టుల కోసం ఫ్రెంచి వారు కూడా అమెరికన్‌లతో కలిసిపోవడం అన్నది చాలా విచారకరమైన విషయం.

నాకు తెలిసినంత వరకూ చైనాలో విదేశీ గూఢచారులు లేరు. అక్కడ విదేశీయులని వేరు చేసి వారికోసమే నిర్మించిన ప్రత్యేక మైన హోటళ్ళలో నివాసాన్ని ఏర్పాటు చేస్తారు. స్థానిక పౌరులకి లభ్యం కానటువంటి ఎన్నో సౌకర్యాలని విదేశీయులకి అమర్చి వాటికి వారివద్దనించి ముక్కు పిండి డబ్బు వసూలు చేస్తారు. ఆ దేశంలో ఫ్రెంచివారు, వారితో పాటు అమెరికన్‌లూ, ఇతర దేశాలవారూ పెద్ద కాంట్రాక్టు ఒక్కటికూడా లభించక ఎంతో కాలంగా కొంగజపం చేస్తున్నారు. చైనావారు భారీ ఎత్తున ఆధునికీకరణ కార్యక్రమాన్ని చేపట్టబోతున్నా, దానికి కావలసిన సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకోవాల్సిన అవసరం ఉన్నా కూడా వారు విదేశీయులని వాళ్ళ కార్యాలయాల దరిదాపులలోకి కూడా రానివ్వరు. ఆ దేశంలోని అధికార వర్గాన్ని మొట్ట మొదటి సారి కలుసుకోడానికి విదేశీ వ్యాపారవేత్తలకి నెలలూ, సంవత్సరాలూ కూడా పడుతుంది. అదే భారతదేశంలో అయితే అందుకు పూర్తిగా వ్యతిరేకం. ఉద్యోగ్ భవన్‌లోని ఏ కార్యాలయంలో కైనా తెల్లవాడెవరైనా నేరుగా వెళ్ళిపోతాడు. మన పర్సనల్ అసిస్టెంట్‌లు,తదితర అధికారులు ఆ వ్యక్తి అందించే డైరీ. పాకెట్ కాలిక్యులేటర్‌ల వంటి వాటికోసం అతనికి పాదాక్రాంతులవుతారు. నాకే గనుక అవకాశం ఉంటే ఒక సంవత్సరం పాటు కొత్తఢిల్లీలో విదేశీయుల ప్రవేశాన్ని నిషేధిస్తాను. అయినా దానివల్ల పెద్దగా ప్రయోజనం ఉంటుందనుకోను. స్వాతంత్ర్యం వచ్చిన నాలుగు దశాబ్దాలకి కూడా తెల్లవాడికంటే తక్కువ వారమనే భావాన్ని వొంటబట్టించుకున్న మనం ఎందుకూ కొరగాని వాళ్ళమనే అనుకోవాల్సి ఉంటుంది.

విదేశీయులు తమకి ఇచ్చిన ప్రశంసాపత్రాలని చూసుకుని నెహ్రూ మురిసిపోయేవారని జయప్రకాష్ నారాయణ్ ఒక సారి నేరుగా నెహ్రూతోనే అన్నారట. మనకి 'ఫారిన్ పిచ్చి' పట్టిందంటే అదేమీ వింతకాదు. అలాంటి మనలో కొంతమంది, వాళ్ళని గూఢచారులనండి, లేక సత్సంబంధాలని అభివృద్ధి చేసే వాళ్ళనండి, వారే దేశాన్ని గుక్కెడు గంజికోసం, గుప్పెడు డాలర్లు లేదా ఫ్రాంకులకోసం దాదాపు అమ్మినంత పని చేశారు. □

"మూర్తీ, ఇక నీ ఈ విచిత్ర జీవితానికి స్వస్తి–" అంటుండగా గీత కాఫీ తీసుకొచ్చింది.

"బావగారూ అక్క రాసిన ఉత్తరం చదవండి–ఎంతమంది సమస్యలో తీర్చగలిగిన మీరు మీ జీవితాన్ని ఒక సమస్యగా చేసుకుంటారా!"

"ఈ ఉత్తరం చదివితే నా సమస్య పరిష్కారమవుతుందా"

"కాదు, చదవండి–" గీత బలవంతంగా శ్రీకాంత్ చేతిలో పెట్టింది ఉత్తరం. అయిష్టంగా నెట్టివేసాడు శ్రీకాంత్.

"గీతా!రెండు రోజుల్లో బెంగుళూరు ప్రయాణం. నువ్వు కొన్నాళ్ళు మీ అక్క దగ్గరుండు. రాధను ఆసుపత్రిలో చేరుస్తున్నాను." మూర్తి మాటలు గీతకు అమృత ప్రాయంగా ఉన్నయి. మూర్తి తనను వంటరిగా రాధతో వదలి వెళ్తాడేమోనని హడలి పోతున్నదామె. సంతోషాన్ని ముఖంలో నే దాచుకుని-

"ఒక షరతుమీదే వెళ్తాను. అక్క ఉత్తరం బావగారు చదవాలి!"

మూర్తి నిస్సహాయంగా శ్రీకాంత్ వంక చూచాడు. శ్రీకాంత్ గబుక్కున ఉత్తరం లాక్కుని చదవసాగాడు. క్రమంగా అతని ముఖంలో రంగులు మారసాగాయి. శరీరంలో రక్తమంతా ముఖంలోకి వచ్చిందా అన్నట్టు ముఖం ఎర్రబడింది. అతనికి కోపం వచ్చినట్టు తెలుస్తూనే ఉంది.

అక్క ఏం రాసిందోనన్న సంశయం లేకుండా వుండటానికే మిమ్మల్నా ఉత్తరం చదవ మన్నాను. మీతో ఒక్క మాటయినా మాట్లాడని అక్క మనసు కొంతవరకైనా మీకు తెలియాలి కదా బావగారూ! అక్కమీద కోపగించుకోకండి. ఇందులో అక్క తప్పేముంది– ఈ సంఘటనలు యదార్థమే అనే విషయం మనసుకి పట్టటానికి కొంత కాలం పడుతుందేమో! అంత వరకు మీరు... ... అక్క విషయంలో...."

'మీ అక్క విషయంలో నేనేమీ అనుచితంగా ప్రవర్తించను. అసలు ఆమె విషయం నా కనవసరం. లోకం దృష్టిలో మేము భార్యా భర్త్రలం. ఆమె దృష్టిలో నేనేమిటో నాకు తెలుసు! ఇప్పుడు నీకూ తెలుసు! కాని, గీతా, నా దృష్టిలో ఆమె నా భార్య! నా అర్ధాంగి! నా సహధర్మచారిణి– నా చిన్ననాటి....... ఆ, సరేకాని రేపు పొద్దున తొమ్మిదింటికి వస్తాను. నువ్వు రెడీగాఉండు. నిన్ను మా ఇంట్లో దింపి మూర్తి, నేను వెళ్ళి రాధను ఆసుపత్రిలో చేర్చివస్తాం. ఏమో, బాగయితే మంచిదేకదా!" వెళ్ళటానికి లేస్తూ అన్నాడు శ్రీకాంత్.

'అవును, రాధ బాగుపడితే అంతకన్నా కావల్సిందేముంది' ప్రశాంతంగా అంది గీత.

శ్రీకాంత్ కారు దూరమయ్యే వరకూ గీత, మూర్తి నిలబడే ఉన్నారు. ఎవరి ఆలోచనల్లో వారు భారంగా లోపలికొచ్చి పడుకునే సరికల్లా రాధ లేచి కూర్చున్నది. ఆరాత్రంతా రాధ మూర్తిని నిద్రపోనివ్వ లేదు. లోపల గదిలో బిక్కు బిక్కుమంటూ అదురుతున్న గుండెలతో తెల్లవారుఝాముకో నిద్ర పోయింది గీత.

* * * * *

బద్ధకంగా కళ్ళు తెరచిన సంధ్య పక్కనే ఉన్న కిటికీ లోంచి బయటకు చూసింది. ఇంకా సూర్యోదయం కాలేదు. అప్పుడప్పుడే వెలుగు రేఖలు ప్రకృతిని తట్టి లేపుతున్నయి. పైనుంచి కింద తోటంతా కనబడుతున్నది. ఎంత అందంగా ఉందాతోట. పూల మొక్కలన్నీ తీర్చి దిద్దినట్టున్నయి. గోడ వారగా మామిడి చెట్లు. ఒక పక్కంతా గులాబీలు. రంగు రంగుల ఆ పెద్ద గులాబీలు తోటకే వన్నె తెస్తున్నయి. బాగా తెల్లవారినా సంధ్య కిటికీ లోంచి చూస్తూ పడుకునే ఉన్నది. శ్రీకాంత్ లేవటం, స్నానం చెయ్యటం,కాఫీ తీసుకోవటం పూర్తయినయి కాని సంధ్య కదలలేదు. ఎదురుగా సోఫాలో కూర్చుని ఏవో కాగితాలు చూసు కుంటున్నాడతను.

"సంధ్యా! తొమ్మిది గంటలకు వెళ్ళి గీతను తీసుకురావాలను కుంటున్నాను!" కాగితాలన్నీ సర్దుతూ అన్నాడు శ్రీకాంత్.

'సరే! మీ అమ్మగారితో చెప్పారా!' కిందకు వెళ్ళబోతూ అడిగింది.

శ్రీకాంత్ కి సంధ్య విషయంలో ఒకే ఒక సంతోషం తల్లి విషయంలో చాలా మర్యాదగా ప్రవర్తిస్తుంది. సుభద్రమ్మ గారికి ఆచారం ఎక్కువ. ఎంత డబ్బున్నా, ఎంత మంది పనివాళ్ళున్నా వంట మాత్రం తనే చేస్తుంది. సహాయానికే మనుషులుగాని వంట ఆవిడ చేతిమీదుగా సాగవలసిందే! వంట, పూజ పది లోపల పూర్తి చేస్తుంది. శ్రీకాంత్ పది గంటలకు భోజనం చేసి వెళ్ళి పోతాడు. సాయంత్రం వరకూ ఆవిడకు పనే ఉండదు. కాఫీ, టిఫిను వంట మనిషి చేస్తుంది. సాయంత్రం ఆవిడ భోజనం చెయ్యదు. రాత్రి కొడుకుకు స్వయంగా వడ్డిస్తుంది. కాసేపు వ్యాపారంలో లాభ నష్టాలు, కొత్త పేర్లు, కొత్త మేనేజర్లు – ఇద్దరూ మాట్లాడుకుంటారు. పది రోజుల కొకసారన్నా ఆవిడ కొడుకుని పెళ్ళి చేసుకోమని పోరు పెడుతుంది. శ్రీకాంత్ నవ్వి వూరుకునేవాడు. అటువంటి తను అకాల వర్షంలా ఒక రాత్రి పెళ్ళి చేసుకుని భార్యతో ఇంటికి వచ్చాడు. ఆవిడకు గుండెల్లో రైళ్ళు పరుగెత్తినయి. అప్సరసల్లాంటి అమ్మాయిల్ని, లక్షల ఆస్తిని కాదన్నాడు. చివరికి ఎవర్నో తీసుకొచ్చి నీకోడలు అని చెప్తే– సుభద్రమ్మగారు నిజంగా క్షణం సేపు రాయయి పోయింది. అయితే జీవితంలో ఆటు పోట్లు తిన్న మనిషి కాబట్టి నిలదొక్కుకుంది. ఆరాత్రి కొడుకుతో మాట్లాడ లేదు. కొత్త కోడల్ని పలకరించ లేదు. ఆ కొత్త కోడలు ఎట్లా ఉన్నది. ఒకపెళ్ళి బట్టలా! మెడలో పూల దండలా! నలిగి పోయిన వాయిల్ చీర! కనీసం తలంటు కూడా పోసుకోలేదు. ఇవన్నీ క్షణాల మీద కనిపెట్టిందావిడ. అంతేకాక, పెళ్ళికూతురు స్వప్నావిష్టురాలిగా, ఏదో లోకంలో వున్నట్టే వుందిగాని పెళ్ళికూతురు లక్షణాలేవీ ఆవిడకు కనపడ లేదు. శ్రీకాంత్ ముఖం కూడా వెలవెల పోతున్నది. కొడుకు ఏవైనా విపరీత పరిస్థితుల్లో ఇరుక్కుని బలవంతంగా ఈ పెళ్ళి చేసుకోవలసి వచ్చిందా అని ఆవిడకు అనుమానం కలగక పోలేదు. శ్రీకాంత్ కళ్ళల్లో కాంతి కనిపిస్తూ నే [illegible]



అయినా హఠాత్తుగా ఎదుర్కోవలసి వచ్చిన ఈ పెళ్ళి ఆవిడను సంభ్రమంలో మాత్రం ముంచింది. అందుకే కొడుకుతో ఏ విషయమూ మాట్లాడకుండా తన గదిలో వెళ్ళి పడుకున్నది. అంతే కాకుండా ఏం మాట్లాడినా, ఏమడిగినా అది అయిపోయిన పెళ్ళికి బాజా భజంత్రీ లన్నట్టుంటుందే తప్ప పెద్దగా లాభం మాత్రం ఏముంటుంది? ఆ తెల్లవారు ఝామున నాలుగింటికే శ్రీకాంత్ తల్లి దగ్గరకు వచ్చాడు. వస్తూనే తల్లి పాదాల చెంత వ్రాలి పోయాడు.

"శ్రీ, నిన్ను ఓదార్చనా! ఆశీర్వదించనా!" కొడుకును లేవనెత్తుతూ అంది సుభద్రమ్మ గారు.

"ముందు క్షమించమ్మా! తరువాత ఆశీర్వదించు–"

"ఓ, అయితే నువ్వు కావాలనుకున్న పిల్లేనన్నమాట–" కొంచెం కోపం నిండిన గొంతుతో అంది సుభద్రమ్మగారు.

"అమ్మా! నిన్ను ఈ విషయంలో చాలా నిరుత్సాహపరిచానని నాకు తెలుసు. కాని, ఎందుకు ఈవిధంగా చేసుకోవలసి వచ్చిందో చెప్పలేను. ఇపుడు మాత్రమేమమ్మా– పెళ్ళి కంటే ఘనంగా విందు ఏర్పాటు చెయి నీకు ఎన్నో రోజులుగా కోరికగా ఉంది కదా! సత్యనారాయణవ్రతం చేసుకుందాం. ఒక్క ఈ చిన్న పొరపాటును క్షమిస్తే నాకు తృప్తిగా వుంటుంది– సరయిన కారణం లేనిదే నేనే పనీ చెయ్యనని నీకు తెలుసుగా –' స్పష్టంగా నిర్దుష్టంగా చెప్తున్న కొడుకుని చూస్తూ కూర్చుందావిడ.

"ఏమ్మా! మాట్లాడవేం?"

"పెళ్ళంటే ఎన్ని చూడాలి! కులం, గోత్రం, సంప్రదాయం –"

"అన్నీ వున్నాయి – ఎందులోనూ నేను దాటిపోలేదు. ఒక్కటే లేనిది –డబ్బు–"

ఆరోగ్యంగా, సంపూర్ణ వ్యక్తిత్వంతో తన కళ్ళ ముందు పెరిగిన కొడుకుని తృప్తిగా చూసింది సుభద్రమ్మ.

"సరే, నీ మీద నీకు నమ్మకం వుంది నేను నీ పొరపాటుని...."

"పొరపాటునకు –" తల్లి మాటలకు అడ్డువచ్చాడు శ్రీకాంత్.

"నేను జీవితంలో చేసిన ఒకే ఒక మొదటి మంచి పని, అంటే నా కోసం – నా జీవితం కోసం, నా ఆనందం కోసం–"

"శ్రీకాంత్...." తల్లి ఆశ్చర్యంగా అంది.

"అవునమ్మా! సంధ్య నాప్రాణం! నన్నెంత అపురూంగా పెంచుకున్నావో సంధ్యనలా చూసుకోవాలి! ఇది నా కోరిక – నా వేడికోలు–" స్థిరంగా వున్నాయి అతని మాటలు.

సభద్రమ్మగారు చిరునవ్వుతో కొడుకు తల నిమిరింది. చెరిగి నుదుటి మీద పడిన జుట్టును సరిచేసింది.

"నాయనా! ఇన్నాళ్ళకి నీ, నా, కోరిక సంధ్య రూపంలో మనింటికి వచ్చింది. సంధ్యకు లేనిదేమున్నది! ఇదంతా తనది కాదూ! ఈ యింటికి యువరాణి! సరే, మరి వ్రత మెప్పుడు? విందు ఎప్పుడు ఏర్పాటు చేద్దాం ఇవ్వాళే అయితే బాగుంటుందేమో!"

"వద్దమ్మా, టైము చాలదు. రెండురోజుల తర్వాత పెట్టుకుందాం. మిగతా ఏర్పాట్లన్నీ నువ్వు చూడు–" శ్రీకాంత్ వెళ్ళిపోయాడు. సరాసరి సంధ్య దగ్గరకు వెళ్ళాడు. తల్లిని గురించి చెప్పవలసిందంతా చెప్పాడు. సంధ్య మనసుకి పట్టించుకుందో లేదో తెలియదు కాని మౌనంగా మాత్రం విన్నది. చివరకు తన మీద కోపం తల్లి మీద కోపంగా మారకుండా ప్రవర్తించమన్నాడతను. తల్లి దగ్గరకు సంధ్యను తీసుకెళ్తుంటే అతని గుండెలు భయంగా కొట్టుమిట్టాడినయి. అనుకోని విధంగా సంధ్య సుభద్రమ్మగారి కాళ్ళకు నమస్కారం చేసింది. ఎట్లా కలిసిపోయిందో గాని, ఆవిడతో మాత్రం చాలా అణకువగా, ప్రేమగా వుండసాగింది. సంధ్య వచ్చినప్పటి నుంచీ ఆవిడ కాస్త విశ్రాంతిగా ఉంటున్నది. విందుకి ఎక్కడెక్కడ నుంచో ఎంతో మంది వచ్చారు. సంధ్య

# సరియైన సమయం వచ్చేసింది

సమయం వచ్చింది
భారతదేశపు యువతరం
తమ శక్తులను అధిగమిస్తూ
ఉప్పొంగుతున్న ఉత్సాహంతో
పరిపూర్ణతా శిఖరాలను
అందుకోవాల్సిన సమయం.

సమయం వచ్చింది
భారతదేశపు బాలబాలికలు
జీవన విధానానికి మెరుగులు దిద్దే
విద్యార్జన చేస్తూ,
విజ్ఞానపు క్రొత్త సరిహద్దులను
శరవేగంతో చేరాల్సిన సమయం.



మన భారతదేశం
ప్రపంచంలో అందరి ఎదుటా
సగర్వంగా, సుదృఢంగా, సౌభాగ్యవంతంగా
నిలబడాల్సిన సమయం



## మాతృదేశానికి చేయూత ఇవ్వండి
## కాంగ్రెస్ (ఐ) కే ఓటు ఇవ్వండి

Issued by Shrikant Verma, General Secretary, A I C C, 24, Akbar Road, New Delhi 110 011

Rediffusion/AICC/12e TL

## రాగసంధ్య

సుభద్రమ్మగారు అలంకరించిన విధంగా అలంకరించుకుంది. వ్రతానికి శ్రీకాంత్ పక్కన గొడవ లేకుండా కూర్చుంది. తాత్కాలికంగా అతను కూడా 'సంధ్యా, సంధ్యా' అంటూ ఎంతో మామూలుగా మాట్లాడసాగాడు. కింద ఉండి నలుగురితో తిరుగుతున్నంత సేపూ అతనికి వేరే ధ్యాస వుండదు గాని మేడ పైకి వెళ్ళి ఆ గదిలో అడుగుపెట్టిన వెంటనే తన స్థితి తనకు గుర్తు వస్తుంది. అపుడు ఎంతో బాధ పడతాడు. సంధ్యకు క్షమార్పణ చెప్పుకుంటాడు. సంధ్య మాట్లాడదు. అతను చెప్తున్నంతసేపూ పుస్తకం చూస్తూనో లేకపోతే జడ అల్లుకుంటూనో కూర్చుంటుంది. శ్రీకాంత్ ఆమె నిద్రపోవటానికి ఉపక్రమించటం చూసి తను మాట్లాడడు. రాత్రి గడిచిపోతుంది. తెల్లవారుతుంది. తల్లికి వంటలో సహాయం చేస్తుంది. తల్లి వడ్డిస్తే తింటాడతను. మళ్ళీ రాత్రికి ఇంటికి వచ్చేసరికి తనకోసం తల్లి ఎదురు చూస్తూంటుంది. ఇది జీవితం. మార్పులేని గానుగెద్దు జీవితం! స్పందన లేని జీవితం! రసికత లేని జీవితం! భోజనం చేస్తుండగా ఒకసారి సుభద్రమ్మగారు అడిగింది.

"నీకు పెళ్ళయిన తరువాత నాకీ పని తప్పుతుందనుకున్నాను. అయినా కొత్త పెళ్ళాం – నీ కోసం కాచుకుని నీ సేవలన్నీ తనే చెయ్యాలిగాని, ఈ వయసులో కూడా నాకీ శ్రమేమిటి?" అన్నది.

ఆ మర్నాటి నుంచీ భోజనం సంధ్యకూ, శ్రీకాంత్‌కీ ఇద్దరికీ పైకే తెప్పించేది సంధ్య. భోజనం వేళకి వస్తే ఇద్దరూ మౌనంగా భోజనం చేసేవారు. లేకపోతే సంధ్య తినేసి పడుకుంటుంది. కాస్త ఆలస్యంగా వచ్చినా లేవదు. శ్రీకాంత్ తనే పెట్టుకుని తినేవాడు. మొదట్లో అలవాటు లేక చేతనయేది కాదు. ఒక్కో రోజు బద్ధకంగా ఉంటే తినేవాడుకాదు. అయినా, ఎదురుగా చూస్తూ కూర్చుంటుందే తప్ప శ్రీకాంత్‌ని తినమని అనదు సంధ్య. మర్నాడు శ్రీకాంత్, సంధ్య ఇద్దరూ ఉండగా అన్నది సుభద్రమ్మగారు.

"ఏరా! ఒక మనిషి అన్నమే ఇద్దరూ తిన్నారా!"

"సంధ్య ఆకలిగా లేదని తినలేదు. నేను తిన్నాను!" తేలిగ్గా అనేసేవాడు శ్రీకాంత్.

సంధ్య ఇబ్బందిగా ఫీలయేది. మర్నాటి నుంచీ శ్రీకాంత్ కోసం ఆగేది. అతను తినటం అయింతర్వాతే తను తినేది. ఒకటి రెండు సార్లు శ్రీకాంత్ ఇద్దరికీ వడ్డించేవాడు. ఎంత పిలిచినా సంధ్య వచ్చేది కాదు. తన భోజనం అయితేనే వచ్చేది. అర్థం చేసుకుని అతను తన దోవన తను తినేవాడు. ఒక రకంగా ఈ జీవితం ఇద్దరికీ విసుగ్గానే ఉంది. గదిలో సంధ్య వేరు. గది దాటితే వేరు. కొంతవరకు సుభద్రమ్మగారు గ్రహించారు. ముఖ్యంగా మంగి గదిలో ఇద్దరి మంచాలూ చెరొక దిక్కునా వున్నయ్యని చెప్పింది.ఆవిడ గుండె నొప్పి మూలంగా పైకి వెళ్ళదు. మేడ ఎక్కలేదు కాని మేడ మీద జరిగే విషయాలన్నీ ఆవిడ చూస్తున్నట్టే చెప్పగలదు. కొడుకుకి, కోడలికి సాంసారిక సంబంధం లేదని ఆవిడ సంధ్యను చూస్తూనే చెప్పగలదు. మరి కొడుకు కావాలని మోజుపడి తన జీవిత ధ్యేయం సంధ్యను భార్యగా పొందటమే అని చేసుకున్నాడు. తను చూస్తున్నంత సేపూ సంధ్య విరక్తిగా ఉండదు. ముఖ్యంగా తనతో ఎంతో చనువుగా, అనురాగంగా వుంటుంది. సుభద్రమ్మగారికి ఈ వ్యవహారం అంతుపట్టలేదు. దీనికి మార్గం ఇద్దర్నీ వంటరిగా వదలటమే! అందుకే ఆవిడ ప్రయాణం పెట్టుకున్నది.

★ ★ ★ ★ ★ ★

ఆ క్రితం రోజే ఆ నిర్ణయం తీసుకున్న సుభద్రమ్మగారు కొడుకుతో చెప్పటానికి ఎదురు చూడసాగింది. శ్రీకాంత్ తల్లి దగ్గరకు వచ్చాడు. అపుడే పూజ ముగించి బయటకు రాబోతున్నదావిడ.

"అమ్మా! సంధ్య చెల్లెలు గీత లేదూ! వాళ్ళ అత్తగారు పోయింది కదా!మూర్తికి బెంగుళూరులో ఇల్లూ అదీ కాస్త సర్దుకోవాలి! అంతవరకు గీత ఒంటరిగా వుండాలి. అందకని ఇక్కడకు తీసుకురావాలనుకుంటున్నాను!" సోఫాలో కూర్చుని బూట్ లేసు కట్టుకుంటూ అన్నాడు.







"ఏమో బాబూ! నీ సంసారం గొడవ లేవో నువ్వవడు. కొన్నాళ్ళపాటు న్నేను తోటలో బంగళాలో వెళ్ళి ఉందా మనుకుంటున్నాను!"

తల్లి మాటలకు ఆశ్చర్యపోయాడు శ్రీకాంత్.

"ఎందకమ్మా! సంధ్య ఏమైనా అన్నదా! నువ్వెందుకీ నిర్ణయం తీసుకున్నావు? ఈ యింట్లో నువ్వు లేకపోతే క్షణం కూడా గడవదని నీకు నే చెప్పాలామ్మా!"

"అదికాదు శ్రీకాంత్. నాకు కూడా కొంత విశ్రాంతి కావాలి కదా! నీ భార్య చదువుకోనిది కాదు. నేను వదిలేస్తే తప్ప బాధ్యతలు తెలియవు!" తన ప్రయాణం ఖాయం అన్నట్టు మాట్లాడిందావిడ.

"కాదు. అది కానేకాదు – నీ మనసులో ఏదో వుంది. నువ్వూరికే వెళ్తానని అనటం లేదు. గీతను తీసుకు రావటం నీ కిష్టం లేదా!" సందేహంగా అడిగాడు శ్రీకాంత్.

"తీసుకురా. నాకేం – కానీ. నీ సంసారం సంగతి చూచుకో. నీ భార్య నీతో మామూలుగా అందరిలా ఉంటుందా! నీకు నా దగ్గర అన్నీ రహస్యాలు. నాతో చెప్పకుండా రహస్యంగా పెళ్ళి చేసుకు వచ్చావు. నేను కాదనలేదు. నువ్వు కష్టపెట్టుకుంటావని ఆ అవమానాన్ని దిగమింగి ఊరుకున్నాను. కాని. ఇందులో కూడా నువ్వు సుఖపడుతున్నట్టు లేవు. ఎందుకని? ఇష్టమయ్యే చేసుకున్నారు కదా! చెప్పు – నాకీ విషయం తెలిస్తే తప్ప నాకు మనశ్శాంతి ఉండదు–"

ఆవేశంగా అంటున్న తల్లిని ఇబ్బందిగా చూచాడు శ్రీకాంత్.

"అమ్మా. మేము అన్యోన్యంగా లేమని నువ్వెందు కనుకుంటున్నావు?" ఎదురు ప్రశ్న వేసాడు శ్రీకాంత్.

"మీరు కొత్తగా పెళ్ళయిన జంటలా వున్నారని నన్ను నమ్మమంటావు! అంతేగా! సరే. నాకెందుకీ గొడవంతా – చూడకుండా వుంటే బాధ ఉండదు– నన్ను వెళ్ళనీ శ్రీకాంత్–" ఇక మాట్లాడవలసింది లేదన్నట్టు ఆవిడ లోపలికెళ్ళబోయింది.

"అమ్మా! నీ ఇష్టమే అదయితే అట్లాగే వెళ్ళువుగాని. కాని ఒక్క రెండు రోజులుండు. గీత వస్తే నువ్వు లేకపోతే నేను ఒక్కణ్ని సమర్థించుకోలేను" అతనూ బయలుదేరుతూ అన్నాడు.

"అదేం. 'ఒక్కడ్ని' అంటున్నావు? ఇప్పుడేగా మేము చాలా అన్యోన్యంగా ఉన్నామన్నావు! అక్క దగ్గరకు చెల్లెలొస్తుంటే మధ్యలో నేనెందుకు? అంత అన్యోన్యంగా వున్న మీరు ఆమాత్రం సమర్థించుకోలేరా!"

తల్లి గొంతులో వ్యంగ్యానికి శ్రీకాంత్ చలించిపోయాడు. తల్లితో ఈ రకమైన సంభాషణ అతనెప్పుడూ ఎరుగడు. తల్లి చెప్పటం. తను వినటం. తల్లికి తెలియని విషయాల్లో తను చెప్తే తల్లి వినేది. ఇప్పుడన్నీ కొత్త సమస్యలు. జీవితం కొత్త పంథాలో నడుస్తున్నది.

"అమ్మా!" అతనికేం చెప్పాలో. తల్లినెట్లా అనునయించాలో తెలియలేదు తల్లి తన కెదురుగా కంట తడిపెడుతున్నది. ఎప్పుడో తన చిన్నతనంలో తండ్రిపోయిన దుఃఖం తల్లిలో చూచాడు. తను కాస్త ప్రయోజకుడై చదువుకుని. వ్యాపారంలో లోతుపాతులన్నీ తెలుసుకుని సంఘంలో ఒక వ్యక్తిగా నిలబడిన ఈ ఇన్ని సంవత్సరాలల్లో తల్లి కళ్లల్లో ఆత్మస్థైర్యం. దీక్ష. పట్టుదల చూచాడేగాని ఈ దయనీయమైన నీళ్ళు నిండిన కళ్లను చూడలేదు. తనెంత దురదృష్టవంతుడు కాకపోతే ఈ రకమైన వైవాహిక జీవితం తనకు సంప్రాప్తమౌతుంది. ఇప్పుడు తను దిగజారిపోతే తల్లి మరింత దుఃఖిస్తుంది. తను ధైర్యంగా వుండి తల్లికి ధైర్యాన్నివ్వాలి! చిరునవ్వుతో ఎదుర్కోవాలి!

"అమ్మా! సంధ్య ఒక రకం మనిషి. తను చాలా బీద కుటుంబం నుంచి వచ్చింది. నేనెంత చెప్పినా డబ్బు కోసమే నన్ను పెళ్లిచేసుకుందని నువ్వనుకుంటావని ఆవిడ భయం. అందుకని నీ ఎదురుగా నాతో మాట్లాడాలంటే భయపడుతుందనుకుంటా! నా విషయం నీకు తెలుసుకదా! ఈ పనుల ఒత్తిడి. ప్రతి క్షణమూ జాగరూకతతో నిర్వహించవలసిన ఇన్ని విషయాల మధ్యలో భార్యతో సరదాగా కాలక్షేపం చేసేట్టుగా ఉంటుందా! నువ్వు అనవసరపు అనుమానాలు పెట్టుకోకు!"

తల్లికి మళ్లీ మాట్లాడే అవకాశం ఇవ్వకుండా వెళ్లిపోయాడు శ్రీకాంత్. సుభద్రమ్మగారు చాలాసేపు ఆలోచిస్తూ నిలబడిపోయారు.

సంధ్య ఆవిడ ముందు నుంచే వంట గదిలోకి వెళ్లింది. ఆవిడ అక్కడే డైనింగ్ టేబుల్ దగ్గర కుర్చీ లాక్కుని కూర్చుంది.

(ఇంకా ఉంది)

## 'జ్ఞానం'

వెలుగు చీకటిని
పార ద్రోలినట్లు
–జ్ఞానం మౌఢ్యాన్ని
పోగొడుతుంది
మనిషిని
మహోన్నత స్థాయికి
గొని పోతుంది!

–సుహాసిని

## వ్యక్తిగతం



బొంబాయికి చెందిన పెద్ద పారిశ్రామికవేత్త మనేక్‌లాల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ మానేజింగ్ డైరెక్టరు అయిన యోగేష్ ఓ. మనేక్‌లాల్‌ని ఇంటెలిజెన్స్ బ్యూరో అధికారులు బొంబాయిలోని ఆయన విలాసవంతమైన అపార్ట్‌మెంటులో అరెస్టు చేశారు. ఈయన తమ సంస్థ ఢిల్లీ కార్యాలయంలో లైజాన్ అధికారిగా ఉన్న కుమార్ నారాయణ్ ద్వారా ప్రధాన మంత్రి సచివాలయం, ఇతర మంత్రిత్వ శాఖల కార్యాలయాలనించి అత్యంత కీలకమైన రహస్య పత్రాలని సంపాదించి వాటికి నకళ్ళు తీయించి విదేశీయులకి అందజేయడం ద్వారా ఎన్నో పెద్ద పెద్ద విదేశీ కాంట్రాక్టులని తమ సంస్థకి వచ్చేలా చేసుకున్నాడని ఆరోపింపబడింది. 1980 నించీ మనేక్‌లాల్ సంస్థ ఒడిదుడుకులకి లోనవుతున్నా, కుమార్ నారాయణ్ జీత భత్యాలని ఊహకి అందనంతగా పెంచడంతో ఇంటెలిజెన్స్ అధికారుల దృష్టి దీనిమీద పడి ఈ గూఢచారి చర్యల గుట్టు రట్టయింది....



ఇటీవల బయట పడిన గూఢచారి చర్యలలో కీలక పాత్రధారి కుమార్ నారాయణ్ ఒకప్పుడు బ్రిటిష్ సైన్యంలో పని చేశాడు. కేరళకిచెందిన ఈ కుమారన్ నారాయణన్ రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్నప్పుడు సైనిక తపాల విభాగంలో విదేశాలలో పని చేశాడు. అమెరికాలోని అధికారులు, వ్యాపార వేత్తలతో అప్పుడే ఈయనకి పరిచయాలు ఏర్పడ్డాయి. యుద్ధం ముగిసిన తర్వాత భారతదేశం వచ్చి ఒక అమెరికా వ్యాపార సంస్థలో చేరాడు. అప్పుడే ఈయన తన పేరుని కుమార్ నారాయణ్‌గా మార్చుకున్నాడు. 1958 లో మనేక్‌లాల్ సంస్థ ఢిల్లీ కార్యాలయంలో రీజియనల్ మానేజర్‌గా చేరాడు. ప్రధాన మంత్రి సచివాలయం, ఇతర మంత్రిత్వ శాఖల కార్యాలయాల ఉద్యోగులు కొందరిపై కాంతా కనకాలని ప్రయోగించి అత్యంత కీలకమైన రహస్య పత్రాలని తన కార్యాలయానికి తెప్పించుకుని వాటి నకళ్ళు తీసి అమెరికా, రష్యా, పోలాండ్, తూర్పు జర్మనీ దేశాల వారికి అందచేసేవాడు. మనేక్‌లాల్ సంస్థ గత నాలుగైదేళ్ళుగా క్లిష్ట పరిస్థితిలో ఉన్నా ఈయన జీత భత్యాలు మాత్రం చెప్పుకో దగినంతగా పెరగటం విశేషం. ఈ గూఢచారి కార్యకలాపాల వెనుక ఉన్న వ్యక్తి తన యజమాని మనేక్‌లాల్ అనీ, ఆయన కోసమే తానిదంతా చేశాననీ ఆయన ఇంటెలిజెన్స్ అధికారులతో చెప్పడంతో కథ మరో మలుపు తిరిగింది

# వారఫలం

## 1-3-1985 శుక్రవారం మొదలు 7-3-1985 గురువారం వరకు

★ **మేషం :** వ్యాపారం పెరగటానికి శత విధాల కృషి చేయాలి. ఎక్కడ పొరపాటు ఉన్నదో గ్రహించటం అవసరం. సాహితీ రంగాన మీ మాటకు విలువ పెరుగుతుంది. ద్రవ్య సంపాదనకు నూతన మార్గం అన్వేషించాలి. స్త్రీలకు: ధాన్య సంపదకు, నగల కొనుగోలునకు అనుకూల వారం.

★ **వృషభం :** ఇటీవల నాలుగు విధాలా చాలా యిబ్బందులకు, కష్ట నష్టాలకు గురి అయినారుగా! అనుకొన్న విధంగా లబ్ధి లేకపోయిందిగా! రాజకీయ వ్యవహారాలు అనుకూలించ లేదని తెలిసికొన్నారుగా, బాగా ఆలోచించి శ్రమించుటవసరం. స్త్రీలకు: దేశమందో విదేశాలకో ప్రయాణించే అవకాశాలు మెండుగా ఉన్నాయి.

★ **మిధునం :** ఉద్యోగమందు ఆశించిన ప్రయోజనం లభ్యమయిందిగా! మరి కొంత మేలు ఉద్యోగరీత్యా పొందనున్నారు. రాజకీయంగా మీకు అంతో యింతో మేలు చేకూరటం ఖాయం. నూతనాంశాలు గ్రహిస్తారు. స్త్రీలకు: నానా విధాల ఆదాయమున్నదని, రాజకీయ రంగాన కొందరకు ప్రవేశం లభ్యం కాగలదని చెప్పవచ్చు.

★ **కర్కాటకం :** విద్య పెంపునకో, వ్యవహార పరిష్కారానికో, వ్యాపార విస్తరణకో, కళారంగాన పెంపునందుటకో వారమంతా శ్రమిస్తారు. మేలు పొందగలరు కూడ. అధికారులను కలిసికొనే అవకాశం కూడా ఏర్పడుతుంది. వస్తుసేకరణకు, ధాన్య సంపత్తిని సద్వినియోగం చేసికొనుటకు అనుకూలం. స్త్రీలకు: నూతనాంశాలు గ్రహించటం, శుభకార్య తత్పరతకు అనుకూలం.

★ **సింహం :** గత కొన్ని వారాలకన్నా అన్ని రంగాలలో అనుకొన్న విధంగా సర్వకార్యాలు జరిగిపోవటం గ్రహించగలరు. నూతన వ్యాపార ప్రసక్తి కొందరకు అనుభవనీయం కాగలదు. కృషికి తగిన ధనాదాయం సంక్రమించుటకు ఆక్షేపణలేదు. స్త్రీలకు: నూత్న విధాన ధనాదాయం, వృత్తియందు పెంపు.

★ **కన్య :** ఎవరినో నమ్మి కార్యసాధనకు ప్రాకులాడుట శ్రేయస్కరం గాదు. ఆశించి చేత చిక్కుతుందనుకొన్న వ్యవహారం దూరంగా పోతుంది. శ్రమ మిగులుటతప్ప మరే రకంగా లాభం చేకూరుట సంభవం. వ్యర్థ ప్రయాణానుకూలతకు అవకాశమున్నది. అవకాశవాదులను దాపునకు రానీయకండి. స్త్రీలకు: ద్రవ్యాదాయం, ధాన్య సంపత్తియందు పెంపు చేకూరుట నిశ్చయం ఆరోగ్యరీత్యా జాగ్రత్తపడుట న్యాయం

★ **తుల :** ఎవరికన్నా మీరు అధికులని అన్ని వ్యవహారాలలో జోక్యం పుచ్చుకొంటారు? గ్రహస్థితి అనుకూలంగాలేదు. అందుచేత అనవసర జోక్యం తగదు, ఆర్భాటం అంతకన్నా తగదు. స్త్రీలకు: కళారంగాన తప్ప తక్కిన రంగాలలో వారమంతా శ్రమకరంగా తోస్తుంది. ఆరోగ్య విషయంలో జాగ్రత్త పడాలి.

★ **వృశ్చికం :** వ్యాపార రీత్యా సర్వోత్తమమయిన వారం. వ్యవహారం తికమకపెట్టినా లాభదాయకమే. ఎంతో శ్రమ చేస్తేనే గాని యితరులకు చెల్లింపవలసిన ఫైకం సమకూడదు. ఒకవేళ అందుకుగాను అప్పు చేయవలసి రావచ్చు. రాజకీయ రంగాన దూకాలనే ఆకాంక్ష ప్రబలుతుంది, కాని ఏం లాభం? ఊరకుండుట ఉత్తమం. స్త్రీలకు: వృత్తిరీత్యా మేలైన వారం.

★ **ధనుస్సు :** శుక్ర శనివారాలందు మీ అభీష్టం ఎలాంటిదైనా నెరవేరుతుంది. రాజకీయంగా వాంఛిత ఫలం సునాయాసంగా దక్కుతుంది. బంధువుల తాకిడి అధికం కావటం కూడా గమనించ గలుగుతారు. స్త్రీలకు: అధికాదాయం, ఆనందం, ఆరోగ్యాభివృద్ధి.

★ **మకరం :** తరచుగా ప్రయాణాలు చేయవలసి రావచ్చు. వ్యాపార రీత్యా అయితే చాలా మేలు కలుగుతుంది. అధికార మందభివృద్ధి, నిలువ చేసిన సామాగ్రికి విలువ హెచ్చుతుంది. ఆశించి నంతకన్న అధికాదాయం సంభవం. విరోధి వర్గం లొంగటం గమనించగలరు. స్త్రీలకు: చికాకు వారంగా, ధనలోపం ఉన్నదని గ్రహిస్తారు.

★ **కుంభం :** నాలుగు విధాలా మేలైన వారం. వ్యాపారంలో అధిక తృప్తి ఏర్పడుతుంది. రాజకీయాలలో పాల్గొనాలని అభిలషిస్తారు, ఆశపడుతారు. సాయం చేసే వారుంటారు. ఆదివారం చాలమందికి ఏదో మేలు చేకూరనున్నది. రాజకీయంగా సదవకాశం లభించటం కొందరు గమనిస్తారు. స్త్రీలకు: నూతనాంశాలు గ్రహించటం, శుభవార్తా శ్రవణం.

★ **మీనం :** ఈ వారం అఖండ మేలు చేకూరనున్నది. నూతన వస్తుసేకరణకు అవకాశమున్నది. వాహనం సరిజేసుకొనుటలో కొంత కాలం వ్యయమవుతుంది. రాజకీయంగా శ్రమించటం ఏమంత క్షేమ కరం గాదు. ఆశించినంతకన్న అధిక ధనాదాయమున్నది. స్త్రీలకు: వస్తు వాహన సేకరణకు, వ్యాపార రీత్యా అనుకూలతకు, ఉద్యోగ మందు చికాకు తొలగుట కవకాశం గలవారం, గ్రహించండి.

–విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# సరియైన సమయం వచ్చేసింది

సమయం వచ్చింది
భారతీయ మహిళలు
తమ ఎర్రటి కుంకుమ బొట్టు వెనుక వున్న
ఎనలేని మహోజ్వల శక్తులను గుర్తించి
క్రొత్త సమాజాన్ని రూపొందించడానికి
నడుము బిగించాల్సిన సమయం.

సమయం వచ్చింది
సమాజం తన సామాజిక పద్ధతులు
సనాతనమైనవని మురిసిపోవడంతో
సరిపుచ్చుకోక ఆధునికంగా
సమంజసమైనవా, కావా
అని ప్రశ్నించి, పరీక్షించాల్సిన సమయం.



మన భారతదేశం
ప్రపంచంలో అందరి ఎదుటా
సగర్వంగా, సుదృఢంగా, సౌభాగ్యవంతంగా
నిలబడాల్సిన సమయం



## మాతృదేశానికి చేయూత ఇవ్వండి
## కాంగ్రెస్ (ఐ) కే ఓటు ఇవ్వండి

Issued by Shrikant Verma, General Secretary, A I C C , 24, Akbar Road, New Delhi 110 011

Rediffusion/AICC/13e TL

పెద్దకథ

# మండుటెండలో మంచుబొమ్మలు

సాయిరమేష్ (రాధ)

(గత సంచిక తరువాయి)

ఆరోజు శంకరరావు కావాలనే యింటికి లేట్‌గా వచ్చారు. ఎప్పటిలా శీతాకాలపు యింగ్లీష్ వాతావరణం మూడింటికే పగటిపూటకి స్వస్తి చెప్పి చీకటికి సుస్వాగతం పలుకుతుందేమో, సాయంత్రం ఏడు గంటలు దాటకుండానే అర్ధరాత్రిని గుర్తు చేస్తోంది ఆగనికాలం ఆ రోజుకూడా. అంతవరకూ హాస్పిటల్‌లో తన కన్సల్టింగ్ రూమ్‌లో కూర్చుని పర్సనల్ స్టీరియోలో ఘంటసాల గారి పాత పాటలు వింటూ గంటల తరబడి వుండిపోయారు.

ఓ వారం పది రోజుల నుంచి రావుగారి మనసు మనసులో లేదు. బాధో, బెంగో తెలియని దురావస్థ మనసుని పదే పదే పీకుతుంటే, జరిగింది తలచుకుని దిగులు చెందాలో లేక దుఃఖం దిగమ్రింగి మొండిగా బ్రతకాలో తోచక తికమక పడుతున్నాడాయన.

వెండీ యింట్లోలేదు. బదులుగా డైనింగ్ టేబిల్ మీద ఆమెగారు వదిలిపోయిన ఓ వుత్తరం ముక్క మాత్రం రెక్కలు తెగిన పక్షిలా బిక్క చచ్చిపడివుంది రావుగార్ని రెచ్చగొట్టటానికి అన్నట్టు.

ఆ పిట్టలేఖ సందేశంయిది –

ప్రియమైన శ్రీవారికి,

డిస్కో పార్టీకి రమ్మని డయానా బలవంతం చేస్తే వెళ్ళక తప్పిందికాదు. సారీ డార్లింగ్ ఏమీఅనుకోక. తొందరగా వచ్చేస్తానుగా.నీకోసం కమ్మటి ఫలావ్ రైస్ నేనే స్వయంగా వండి పెట్టాను. మిగతా వంటకాలన్నీ మెయిడ్ చేసిందనుకో. అన్నట్టు ఈరోజు మెన్యూలో ఏముందో తెలుసా...నీకు అత్యంత ప్రీతికరమైన తందూరీ చికెన్.... హౌ ఈజ్ యిట్..... హోప్...యువిల్ ఎంజాయ్ ఎవ్రీ తింగ్... టేబిల్ అరేంజ్ చేశాను. వంటకాలు మాత్రం మైక్రో ఒవెన్‌లో వుంచాను వేడిగావుంటాయని. శ్రమ అనుకోకుండా అన్నీ వడ్డించుకుని తిను, స్వీట్ హార్ట్.. సి. యు..టు...నైట్ –

నీ ప్రియమైన, వెండీ

'ఈవిడగారికి యిప్పుడు డిస్కో కావాల్సి వచ్చింది కాబోలు.. వున్నట్టుండి ఈ సూడిదలు ఏమిటో' పళ్ళు పటపటలాడిస్తూ ఆలిమీద కోపం ఆయిల్లాలి లేఖ మీద చూపించారు శంకరరావు చింపి ప్రోగులు పెడుతూ

అయినా వుద్రేకం చల్లారలేదు ఆయనకి. మాల్ట్ విస్కీ [illegible] ముక్క కాదు, కనీసం చల్లనినీళ్ళైనా కలుపుకోకుండా.

అప్పటికీ ఆయనకి వుపశమనం కలుగలేదు. మేడమీద స్టోర్ రూమ్‌లోకి వెళ్ళి లాఫ్ట్‌లో ఓమూల దుమ్ముపట్టి పడివున్న ఆల్బమ్ లన్నీ బయటకు తీశారు. బూజు దులుపుతూ ఒక టొకటి తిరగ వేస్తుంటే, ఆయన మనసు ద్రవించి పోయింది. 'నీదే తప్పంతా' అని ఎవరో నిలదీసి వెక్కిరించినట్టు ఫీల్ అయ్యారు. భారతీదేవి, తనూ కలిసి తీయించుకున్న మనోహరమైన రంగుల బొమ్మలవి. పదిహేనేళ్ళ పండంటి సంసారంలో ఆఖరికి తను మిగుల్చుకున్న తీరని వేదన, భారతి వదలిపోయిన తియ్యని అనుభూతి ఆ ఫోటోలు మాత్రమే అన్న మనో భావన ఆయన హృదయానికి ఓ రంపపు కోత అయ్యింది, మనసుని మరింత వికలపరుస్తూ.

'భారతితో చేసుకున్న బ్రతుకు పండగ యిక తిరిగి రానిదే కదా' అన్న ఆలోచన చెలరేగగానే ఆయనలో దుఃఖం సుడులు తిరిగింది.

విస్కీ వేడికి గుండెల్లో కరుగుతోన్న విచారం ఏదో తెలియని గుబులు పుట్టించటంతో ఆర్ద్రమైన ఆయన కళ్ళు కన్నీటి ధారలు కట్టాయి. దట్టమైన మేఘ మాల ఎత్తైన హిమగిరి తాకిడికి తాళలేక ధారాళంగా వర్షించినట్టు.

జీవితంలో అది రెండోసారి శంకరరావు గారు భారతి కోసం పరితపించటం –

మొదటిసారి పెద్దల్ని ఎదిరించి ఆ బంగరు బొమ్మని పొందలేనేమో అన్న పిరికి తనంతో, యిప్పుడు చేతులారా తన భారతిని కోల్పోయేనే అన్న విచారంతో. బహు చిత్రమైనది జీవితం ! మనిషి కోరింది మనసు కోరదు, మనసుకోరింది మనిషికి దక్కదు. మనసూ, మనిషీ కోరిందీ , రెండిటికీ దక్కిందీ ఒక్కటే అయితే మనిషికి దేముడుతో అసలు పనే వుండదేమో?

అర్ధరాత్రి దాటుతోంది. శంకరరావుగారి యింటి దగ్గర రెండు కార్లు వచ్చి ఆగాయి.

ఓ వయ్యారి భామ ముందు కారులోంచి దిగి రెండో కారు దగ్గరకి వెళ్ళింది.

"థాంక్యూ ఫర్ ది ఈవినింగ్....డార్లింగ్" అంటూ అద్దందించుకుని తల బయటకు పెట్టి చూస్తున్న దొరబాబుకి వీడ్కోలు చెప్పింది వెండీ ముచ్చటగా ముద్దిడుతూ అసలు స్వర్గం ఎలా వుంటుందో..... ఎక్కడ వుంటుందో నాకు తెలియదు [illegible] కలిసివున్న ప్రతిక్షణం మాత్రం నిజంగా నాకు స్వర్గమే అనుకో.... ప్రామిస్...., అయ్ డోంట్ వాంట్ టు మిస్ యు.. హనీ....." అన్నాడు ఆ బుల్లోడు కొంటె చూపులో తైపెక్కించే వెండీ అందాలు గ్రోలుతూ.

"అయ్ నో డార్లింగ్...యు ఆర్ క్రేజీ ఆఫ్ మి.... ఈ చాటుమాటు మంతనాలు నాకూ యిష్టంలేదు మరి... కాని ఏంచేస్తాం.... కొన్నాళ్ళు .. ఈ దాగుడు మూతల ఆటలు ఆడక తప్పదు .... అయ్ టూ.. కాంట్ రెసిస్ట్ దిస్ టెంప్టేషన్ మచ్ లాంగర్..... స్వీట్ హార్ట్....." అంది గోముగా లాలిస్తూ.

"ఆ ముసలాడితో చెప్పేయకూడదూ.... అసలు సంగతేమిటో" పరిహసించాడు పీటర్ వెకిలిగా నవ్వుతూ.

"నీకేమైనా మతి పోయిందా... మన గుట్టు బయటపెడితే ఆపెద్దమనిషి నిన్ను నన్నూ యింట్లోకి ఆహ్వానించి సన్మానిస్తాడనుకున్నావా ఏమిటి....రావ్ విషయం నాకు బాగా తెలుసు కాని... డోంట్ యు ఎవ్వర్ డేర్ టు థింక్ ఆఫ్ యిట్.. యు సిల్లీ బాయ్... బుద్ధిచెప్పింది వెండీ సోగ్గాడి చెంప మీద చిన్నగా కొడుతూ.

"సన్మానించక్కర్లేదోయ్ ... గుండెపగిలి ఛస్తే చాలు.... వాడి చరిత్రసమాప్తం... మన కథ సుఖాంతం... అదేకదా నీ ప్లాన్ అంతా ..."పగలబడి నవ్వాడు పీటర్.

"డోంట్ బి సొరూడ్ పీటర్... ఎంతైనా అతడు నాభర్త.. ఆ విషయం మర్చిపోవద్దు అండర్ స్టేండ్.... ఏది ఎలా దక్కించుకోవాలో ఏమి తెలీదు కదా నీకు.. చిన్న తరహా చేష్టలు పోలేదు సుమా నీకు యింకా...." మందలించింది వెండీ.

"ఓకె స్వీట్ హార్ట్... అయ్ ప్లెడ్ గిల్టీ... ఆల్‌రైట్ దెన్... యిప్పుడు చెప్పు ఏంచేద్దా మనుకుంటున్నావో" ఆరాతియాలని ఆరాటపడ్డాడు పీటర్.

"నీకేమైనా మతిపోయిందా... చెయ్యడానికేముంటుంది... యిది నాయిల్లు నాసంసారం... చక్కదిద్దుకోటం నా కర్తవ్యం..." అంది ఎగతాళిగా.

"కమాన్ స్వీట్ హార్ట్.. డోంట్ టెలమి స్టోరీస్.... నువ్వు ఏదో చాలాపెద్ద ఐడియాలో వున్నావని వూహించలేననుకున్నావా ఏమిటి...

"సర్లే.. నీతోవాదన నాకెందుకు కాని.... లెట్ మిగో....."

చటుక్కున ఆమె చేయి అందుకుని ఆ పాడు

"ఎప్పుడో చెప్తే వదిలేస్తానన్నానుగా..." రెట్టించాడు పీటర్ కొంటెగా నవ్వుతూ వెండీ కాస్త దగ్గరకు జరిగింది మచ్చిక చేసుకుని ఆ మొగధీరుడి పట్టు తప్పించుకోవాలన్న నెపంతో. కాని మురిపించే ఆమనోహరి చిరునవ్వు చూడగానే మత్తెక్కిన మనసు అతడి మనోనిగ్రహాన్ని మరింత సడలించిందే కాని, పిడికిలి పట్టు మాత్రం విడిలించలేదు.

బలంగా దగ్గరకు లాక్కుని ఎగిరిపోతున్న వెండీ అందాన్ని లాఘవంగా తనచేతుల్లో ఇముడ్చుకోవాలని తాపత్రయపడ్డాడు పీటర్.

"యు రిచెడ్ ఫెలో....." అంటూ తమాషాకి చేతి మీద కొట్టి నాజూకైన యవ్వనం మరోసారి నలిగిపోకుండా జాగ్రత్తపడింది వెండీ.

విసుగెత్తితే వెండీ ఏంచేస్తుందో పీటర్‌కి బాగా తెలుసు. అందుకే తాపం చల్లార్చుకుని చేయి వెనక్కు తీసుకున్నాడు.

చిన్నబుచ్చుకున్న చెలికాడి ముఖం చూడగానే ఎన్నడలేని జాలి పుట్టుకు వచ్చింది ఆవగలాడికి.



పీటర్. "ప్లీజ్... డోంట్ యు టెల్‌మి" అని బతిమాలుతూ;

"ఇప్పుడు కాదు.. మరోసారి ఎప్పుడైనా తీరుబడిగా కూర్చుని డిస్కస్ చేద్దాం. ఆవిషయం యు ... ఫాలో యిప్పటికే చాలా ఆలస్యం అయినట్టుంది. నువ్వు యిక వెళ్ళటం మంచిదేమో..." అంది వెండీ కలవరపడి చుట్టూ కలయచూస్తూ.

"ఆల్ రైట్ డార్లింగ్.. ఎప్పుడో చెప్పు విడిచి పెడతాను' అన్నాడు చేయి గట్టిగా పట్టుకుని తనవైపు లాక్కుంటూ.

"అదే ఆకంగారే వద్దంటున్నాను. చూస్తుంటే నా ప్లాన్ అంతా చెడగొట్టేట్టున్నావే... ఫర్ గుడ్ నెస్ సేక్ డోంట్ బి ఎ ఫూల్.. యు అండర్‌స్టాండ్...."

"అఫ్‌కోర్స్... అయ్.. డు.." అన్నాడే కాని చేయి మాత్రం వదలలేదు చిలిపిగా. పెనుగులాడింది వెండీ మనసిచ్చినవాడి పెంకితనానికి చిన్నగా నొచ్చుకుంటూ

ముందుకు వంగి చెంపకు చెంపరాస్తూ – "ఆల్ రైట్.. మైలవ్.... అయ్ విల్ ఫోన్ యు టుమారో... ఓ.కె..." అంది మృదువుగా పెదవులు అందించి ఘాటైన ముద్దుతో ఘనంగా వీడ్కోలు చెప్తూ.

వదిలి వెళ్ళటం యిష్టంలేకపోయినా అంతటితో 'గుడ్‌బై' చెప్పటం తప్పనిసరయ్యింది దొరబాబుకి. ఆ సాయంత్రమంతా వెండీతో గడిపిన మధుర క్షణాలు, కొనసాగించిన విలాస క్రీడలూ మనసులో నెమరు వేసుకుంటూ కారుని రోడ్డు పట్టించాడు పీటర్.

గదిలో లైట్లు ఆర్పి కిటికీ నెట్ కర్టెన్ వెనుకనిలబడి మేడపై నుంచి తొంగిచూస్తూ జరుగుతోందంతా జాగ్రత్తగా గమనిస్తున్నాడు. అయింటి యజమాని అన్న విషయం ఆ తెల్లజంటకి అప్పటిలో తెలిసే అవకాశంలేదు.

# మంచుటెండలో మంచు బొమ్మలు

విస్కీ మత్తు యింకా వదలకా రోడ్డుమీద పాగ్ లైట్ల మసకవెలుగుల్లో చూపుసరిగ్గా ఆనకా ఏవో స్పష్టంగా చూడాలని ప్రయత్నించి విఫలులయ్యారు శంకరరావు ఆయన కనిపెట్టిందంతా ఒక్కటే - ఏవో రెండు జీవాలు క్రింద కపలాడుతూ కృత్రిమమైన కోర్కెలతో చలికాగుతున్నాయని! ఆ దృశ్యంచాలు మాటేసి నక్కిన ఆ వేటగాడి నిండుగుండెల్లో అప్పటికే రగులుతోన్న బలిదాహాన్ని భగ్గున మండించటానిక ?!

బెడ్‌రూమ్‌లోకి వడివడిగా వచ్చింది వెండీ. యింకెక్కడా వెదక్కుండా ఆ బామినిక బాగా తెలుసు శ్రీవారు పదిన్నరకె పడక ఎక్కుతారని

డార్లింగ్ ఆర్ యు దేర్ కంఠంలో కోకిలారవం కుప్పించి, చిరు చీకటిలో పతిదేవుడ్ని వెదుక్కుంటూ పడక తడిమింది వెండీ. నంగనాచిలా

మెలుకువుగా వుండకూడా మాట్లాడలేదు ఆయన నిద్రపోతున్నాడో లేదో అర్ధంగాక దగ్గరకు వచ్చి తొంగిచూసింది

అమాంతంగా ఆమెను చుట్టుముట్టి మీదకు లాక్కున్నారు శంకరరావు

కెవ్వున అరిచింది వెండి భూమాతని తాకడీక తూలిపడుతూ

పగలబడ నవ్వి - యింత పిరికితనం పనికిరాదు సుమా అన్నారు పళ్ళుకొరుకుతూ

నువ్వు యిలా నిద్ర నటిస్తావని నేనేమీ కల కనలేదు మరి ధైర్యంగా నిలబడటానికి

అలక చూపించింది మాటల్లో ఆ అందాల చిలక వెలవెలబోయిన ముఖారవిందాన్ని జీరోవోల్ట్ బల్బులా ఓ చిరుదరహాసంతో చిన్నగావెలిగిస్తూ

నువ్వు ప్రక్కలో లేకుండా నాకు నిద్ర ఎలా పడుతుంది చెప్పు ఆ చీకటిలో అర్ధాంగి ఆరాటాన్ని అవలోకించాలనుకోటం ఎంత అవివేకమో ఆయనక బాగా తెలుసు అందుకే ఆప్యాయంగా ఆమెను పొదివి పట్టుకుని భుజాలు నిమురుతూ అనునయించారు-

అన్నట్లు డిస్కో బాగా జరిగిందా చాలాసేపు వున్నట్లున్నావ్ ఎంజాయ్డ్ యువర్‌సెల్ఫ్

సారీ డార్లింగ్ ఓల్డ్ ఫ్రండ్స్ అంతా కలిసి ఏదేదో మాట్లాడుతుంటే అలా కూర్చుండి పోవాల్సి వచ్చింది బాగా లేట్ అయ్యింది కదూ అయామ్ సారీ బైదీ వే నీకేమైనా యిబ్బంది కలిగించానా అంది పెదవులపై ప్రేమ పూసుకుని

ఓ నో నాట్ యిన్ ది లీస్ట్ అయితే పార్టీ అంతా బాగా జరిగిందన్నమాట

ఓ యస్ స్మాషింగ్ డార్లింగ్

విభూతి వడిలోంచి లేచి వళ్ళు విరుచుకుంది వెండి బద్ధకంగా

బాగా డాన్స్ చేసి అలిసిపోయినట్లున్నావ్ ఆయన మనసు కుతకుతలాడుతుంది కసితో కోపంతో

అవ్‌కోర్స్

ఎవరో కూడా వచ్చి దిగబెట్టినట్లున్నారు

వలువలు విప్పి డ్రెస్సింగ్ చెయిర్ మీదకి విసురుతూ అవును డార్లింగ్ అంది ఆహ్లాదంగా

ఎవరట నీతో వచ్చింది

యింకెవరు నాఫ్రెండ్ డయానా నీకు తెలుసుగా వార్డ్ ఫైవ్ సిస్టర్

అయ్ నో డయానా రేచలే నా

ఎగ్జాక్ట్‌లీ

ఆయన ప్రక్కలో చోటు చేసుకోకుండా, కావాలనే మంచం ప్రక్కన నిలబడి తన నగ్నసౌందర్యాన్ని శంకరరావు ముందు ప్రదర్శించింది వెండీ వున్నట్లుండి బెడ్‌లైట్ వేసి ఒక్కసారిగా శయ్యాగారాన్ని ఓసుందర స్వర్గం చేసి చూపిస్తూ ఆపెద్దమనిషి నోట మరో మాట రాలేదు

పిచ్చుక మీద బ్రహ్మాస్త్రంలా, మగడి పిరికి గుండెని లోబరచుకోటానిక దిరుస్సైన తన బాహ్య సౌందర్యం ప్రయోగించింది వగలాడి వెండీ మరోసారి మంచులో మంటలా చల్లారిపోయారు శంకరరావు కోపావేశాల్ని తన కృత్రిమ వాంఛలకి తాకట్టుపెట్టి, జవరాలి సరసన సద్దుమణిగి ముసుగు తన్నుతూ?

★ ★ ★ ★ ★

శంకరరావు వార్డ్ రౌండ్‌కి బయలుదేరారు వుదయం ఎనిమిదిన్నరకే పరివారమంతా ఆయన కోసం వార్డులో ఎదురు చూస్తూ వుండటం పరిపాటి కాని ఆరోజు మాత్రం అంతవరకూ ఎవరూ రాలేదు. బయట విపరీతంగా మంచు కురిసి చాలా రోడ్లు బ్లాక్ అయిపోటంతో

సిస్టర్ డయానా రేచల్ మాత్రం పేషెంట్ల రికార్డులు తినుబండారాలు కాఫీ, టీ వగైరా సరుకులూ సిద్ధం చేసుకుని కూర్చుంది ఎప్పటిలా

గుడ్ మోర్నింగ్ రావ్ హౌ ఆర్ యు

అయామ్ ఓకె హౌ ఆర్ యు సిస్టర్ డియర్

ఫైన్ అయ్ గెస్

గుడ్ అంటూ చుట్టూ చూసి తన సిబ్బంది ఎవరూ కనిపించకపోవటంతో కాస్తంత కంగారు కనబరుస్తూ- మై గుడ్‌నెస్ ఏయ్ అయ్ టూ ఎర్లీ ఆర్ వాట్ అన్నారు శంకరరావు

అబ్బే లేదే మీరు రైట్‌టైమ్‌కే వచ్చారు ఆలస్యమంతా మిగతా వాళ్లదే ఈరోజు మైండ్ యు వుయ్ కాంట్ బ్లేమ్ దెమ్ విపరీతంగా స్నోపడుతుంటే యింట్లో వెచ్చగా కూర్చోవాలని ఎవరికి మాత్రం అనిపించదు చెప్పు అయ్ హెట్ డ్రయివింగ్ యిన్ స్నో నిన్న నాకారు స్కిడ్ అయ్యి ముందంతా డేమేజ్ అయ్యింది అదో దండ పొంత్తు అనవసరపు ఖర్చు హెల్త్‌బోర్డు నష్టపరిహారం చెల్లిస్తుందా ఏమన్నానా వాతావరణం యిలా వున్నప్పుడు పెంచ్‌లీవ్ పెట్టి హాయిగా యింటి దగ్గర రెస్ట్ తీసుకుంటే ఏ గొడవా వుండదు కాలక్షేపానిక కబుర్లు చెప్పింది డయానా. శంకరరావు అశ్రద్ధగా యింకేదో ఆలోచిస్తున్నారని కనిపెట్టి కూడా అన్నట్లు నిన్ను ఏదో అడగాలనుకున్నాను ఏం టబ్బా అది అంటూ క్షణకాలం ఏదో గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నించినట్లు నటిస్తూ - ఆ అయ్‌గాట్ యిట్ మొన్న డిస్కో పార్టీ బాగా జరిగిందా అని అడిగారు శంకరరావు అవకాశం వదలకుండా

ఏ పార్టీ

అదే వెండి నువ్వూ కలిసి వెళ్ళారు కదా ఏదో డిస్కో పార్టీకి

ఓ యు మీన్ దట్ పెన్సపార్టీ దట్ వజ్ ఆల్‌రైట్ అంది డయానా డాంబికంగా



# సరియైన సమయం వచ్చేసింది

సమయం వచ్చింది
ప్రతి భారతీయుని
అవసరాలను తీర్చడానికై
అభిలాషలను నెరవేర్చడానికై
కాలవేగంతో పోటీ పడుతూ
ప్రగతి
పరుగులు తీయాల్సిన సమయం.

సమయం వచ్చింది
సమృద్ధి కేవలం
ఆశలు అల్లిన కలగానే వుండిపోక
చెమటోడ్చి సాధించిన
వాస్తవికతగా
రూపొందాల్సిన సమయం.





**మన భారతదేశం
ప్రపంచంలో అందరి ఎదుటా
సగర్వంగా, సుదృఢంగా, సౌభాగ్యవంతంగా
నిలబడాల్సిన సమయం**



# మాతృదేశానికి చేయూత ఇవ్వండి
# కాంగ్రెస్ (ఐ) కే ఓటు ఇవ్వండి

Issued by Shrikant Verma, General Secretary, A I C C, 24, Akbar Road, New Delhi 110 011

Rediffusion/AICC/14e TL

చూస్తుంటే నువ్వా పార్టీకి వెళ్ళినట్లులేదే ఖండించారు శంకరరావు కవ్వించి నవ్వుతూ.

ఎందుకట అంత అనుమానం ..” అంది డయానా అతిశయంగా

“అదే.. ఏ పార్టీయో నీకు అసలు జ్ఞాపకం లేకపోతేను..”

డయానా వాడి చూపులికి, వేడినవ్వుకీ తట్టుకోలేక కాస్త వెనక్కు తగ్గారు శంకరరావు మాటలు సర్దుకుంటూ.

“నా మతిమరుపు సంగతి నీకు బాగా తెలుసుగా... అందులో యిలాంటి చిన్న చిన్న సిల్లీ విషయాలు నాకు ఆసలు గుర్తుండవు మరి...” అంది మాటలు విరిచి వెటకరించి సమయస్ఫూర్తి ప్రకటిస్తూ

డయానా తన నుంచి ఏదో దాయటానికి ప్రయత్నిస్తోందని ఆయన పసికట్టక పోలేదు.

“చాలా లేట్ అయినట్లుంది ఆ రాత్రి మీరు యింటికి వచ్చేసరికి..” అన్నారు సౌమ్యంగా, ఆ రంగ దొరసాని నుంచి యింకేదో రహస్యంగా రాబట్టాలన్న ప్రయత్నంలో.

“అబ్బే లేదే ... నేను త్వరగానే యింటికి వచ్చేశాను.. మర్నాడు డ్యూటీకి రావాలి కదా నేను అదృష్టవంతురాలు. మీ అర్ధాంగికి ఆగొడవ ఏమీ లేదుమరి” వ్యంగ్యంగా నవ్వింది డయానా.

“అయ్‌సీ . అయితే వెండీ నువ్వు కలిసి రాలేదన్నమాట”

“వెండీ సంగతి నీకు తెలుసుగా ...ఆమె ఎప్పుడూ అంతే పార్టీలంటే పంచప్రాణాలు మరి మీ ఆవిడకి.. ”

డయానా మాటలు ఆయన అంతరాళాల్లో ప్రతిధ్వనిస్తూ ఎనలేని ఆందోళన చెలరేపాయి, ఎంగిలి పడ్డ ఎదలో.

ఇంగ్లాండ్‌లో డిశంబరు మాసంలో, ఎండన్న మండిపడకపోయినా, విచ్చలవిడిగా ఎండ కాయటం అన్నది కాస్త వింతగానే వుంటుంది మరి శీతల వాయువులికి అలవాటు పడి అతి దట్టమైన దుస్తులు ధరించే దొరలకి ఎక్కడలేని పండగ చేస్తూ సూర్యాస్తమయమేకాదు, సూర్యోదయం కూడా సర్వ సాధారణంగా కనిపించని యింగ్లాండ్‌లో మసక చీకటికి చక్కగా అలవాటు పడ్డ ఆంగ్లేయులు – సూర్యుడు అస్తమించని దేశం మాది' అని డాంబికాలు పలకటంలో మాత్రం వింతేమీ వుండదు. లేని గొప్పలు చెప్పుకుని దేశాలు దోచటం యింగ్లీష్ ప్రజలకీ, ఆత్మవంచన చేసుకుని దగాపడటం బ్రిటిష్ పాలన చవిచూచిన ప్రపంచంలో ఎందరో పౌరులికీ అనాదిగా అలవాటే మరి?

అలాంటి అరుదైన రోజుల్లో ఒకరోజు సూర్యుడు రోజంతా పరిపూర్ణంగా ప్రకాశిస్తూ యింగ్లాండ్‌ని ఏలి కాస్త అలిసి ఎర్రబడ్డ సాయంసమయం అది అందుకే అతిపల్చటి షిఫాన్ జార్జెట్ గౌను ధరించి అపురూపంగా ముస్తాబై కూర్చుంది ముగ్ధమోహిని వెండీ యింటి యజమాని కోసం ఎదురు చూస్తూ

# మందుటెండలో మంచు బొమ్మలు

మధ్యాహ్నం క్లినిక్‌లో ఓ పది మంది పిచ్చివాళ్ళని పరీక్షించి విసిగి వేసారిపోయి యింటి ముఖం పట్టారు శంకరరావు చిరాకుగా.

గుమ్మంలోకి ఎదురు వెళ్ళి వున్నట్లుండి వాటేసుకుంది విభుడ్ని, మెడ చుట్టూ చేతులు మెలివేసి ముద్దులు వరదలో ముంచేస్తూ.

వెండీ దండయాత్రకి తట్టుకోలేక అయోమయంగా చూస్తూ నిలబడిపోయారు శంకరరావు అప్పుడే చెక్కిన ఆర్టిఫిషియల్ అజంతా శిల్పంలా.

“ఆల్‌రైట్ డార్లింగ్ ఏమిటి విశేషం...” అన్నారు తమాయించుకుంటూ.

“చాలా పెద్ద విశేషమే మరి చెప్పుకోవాలంటే...” మొదటిసారిగా వెండీ మొండి ముఖంలో కాస్తంత ముద్దులొలికే, బిడియం మెరిసి మాయమయ్యింది.

“లోపలికి వెళ్ళి మాట్లాడుకుందామా...” మృదువుగా చేతులు విడిపించుకుని శాంతంగా శలవిచ్చారు. ఆ విశేషం ఏమిటో అంతుపట్టక ఆసక్తిగా చూస్తూ.

“ష్యూర్” అంటూ ఎర్రపూల గౌనుకి జతగా వేసుకున్న మెరూన్‌రెడ్ హైహీల్స్‌ని లయబద్ధంగా చప్పుడు చేయిస్తూ వళ్ళు అదిరేలా వయ్యారం వలకబోస్తూ ముందుకి నడిచింది వెండీ.

శంకరరావుగారి మనసు పట్టుతప్పింది మళ్ళీ మాయలేడి వన్నెలు ఎగసి పడుతుంటే తన బంగారంలో కల్తీ వుందని తెలిసినా ఏ పెంటకుప్ప మీదో విసిరి పారేయాలనుకోడు మానవుడు. తగిన రొక్కం దక్కితే ఎవరికైనా అంటగట్టాలి అనుకోటం మానవ నైజం, అతిసహజం. అందులో ఆశ్చర్యం ఏమీలేదు, అధర్మం అంతకంటే లేదు.

ఎందరో తిండిలేక మాడుతున్నారని బెంగపడి తను తిండి మానేస్తే వచ్చే నష్టం ఎవరికి. అందుకే అర్జునుడికి 'ఆపద్బాంధవుడు క్రిష్ణమూర్తి అంతగా నొక్కి చెప్పాడు ఓ నగ్నసత్యాన్ని ఆనాడే – 'ముందు స్వధర్మం చూసుకో– పరధర్మం గురించి తరువాత ఆలోచించు' అని. అది మహాధర్మమో మహోన్నత మర్మమో ఆ మహానారాయణుడికే తెలియాలి కాని కలియుగ మానవాళి మాత్రం భగవంతుడి సందేశాన్ని శుభ్రంగా మలిచి స్వధర్మం బదులు స్వలాభాన్ని పెట్టింది ఆచరణలో? ఈస్వార్థమే ఓ కార్చిచ్చై మానవ ప్రగతిని లోలోన దహించి వేస్తోంది నివురుగప్పిన నిప్పై రగులుతూ. ఏదో ఒకరోజు ఆ బడబాగ్ని బ్రద్దలు కాకమానదు మరి!?

లాంజ్ స్వీట్‌లో చతికిలబడి యిల్లాల్ని వడిలో యింపుగా కూర్చోపెట్టుకుని వీపు నిమురుతూ –“యిప్పుడు చెప్పు అసలు కథేమిటో” అన్నారు.

ఏ పిక్నిక్ పార్టీకో, 'ఆక్స్‌ఫామ్'కి దానధర్మం చేయటానికో అర్జెంటుగా డబ్బు కావాలని అడగటానికే ఈ టక్కులు, టిక్కులు పలకబోస్తోంది పగలాడి అని అపోహ పడ్డాడు ఆమహాశయుడు

ప్లీజ్ . నవ్వకేమరి..” చెంపలు ఎరుపెక్కేలా సిగ్గుపడింది చూడామణి

“ఆల్ రైట్...”

అతినిదానంగా తిలకిస్తూ అలివేణి పురాణం ఆలకించారు శంకరరావు.

“వెరీ హేపీ న్యూస్ ...”

“ ........ ”

“నువ్వు ఎంత ఆనందపడ్డావో చెప్పలేను.

“ఏమిటాయ్ ఈ క్రైమ్‌త్రిల్లర్... అసలు సంగతేమిటో చెప్పు.. ”

“చెప్పమంటావా....”

“నీదే ఆలస్యం. ..” పరిహాసంగా నవ్వారు.

“అయ్ తింక్ ఆయామ్ ప్రెగ్నంట్...' పున్నపళంగా శ్రీవారి మీద వాలిపోయింది.

ఆ అపురూపసుందరి అమాంతంగా వేయి ఏనుగుల బరువు తూగుతున్నట్లు భారంగా ఫీల్ అయ్యారు శంకరరావు పాపం, ఆ సంబరపాటులో.

“ఏమిటన్నావ్...” నమ్మలేక రెట్టించారు.

“ఏమన్నానా... నీ విరహప్రతాపం నా మీద బాగానే ప్రయోగించావు .. అదంతా ఫలించే రోజు వచ్చింది యిన్నాళ్ళకి... అంటున్నాను' అంది వత్తి పలుకుతూ.

శ్రీవారి చెంపల్ని చిరుముద్దులతో సింగారిస్తూ.

“రియల్లీ...వాట్ ఎ వండర్ ఫుల్ న్యూస్ డార్లింగ్ ..” పైకి హుషారుగా వుండటానికి ప్రయత్నిస్తున్నారే కాని శంకరరావుగారి మనస్సులో మాత్రం ఎనలేని సంచలనం ఏర్పడింది అప్పటికే.

మబ్బుల తెరలు దోబూచు లాడుతూ పెను తుఫానుకి స్వాగతం పలికినట్లు, చిరుగాలి బలం పుంజుకుంటూ పెనుగాలికి తొలి పలుకు పలికినట్లు, ఆయన అంతరంగంలో ఓమూల పడి వున్న అసూయని తట్టిలేపింది అనుమానం

“నాకెంత గర్వంగా వుందో తెలుసా .. నేను తండ్రిని కాబోతున్నాను...” ఆనందాతిశయాలు తెచ్చి పెట్టుకుని ఛాతీ ఎత్తి చూపించారు శంకరరావు.

“ఎస్ డార్లింగ్... అయ్ టూ... రియల్లీ ప్రౌడ్ ఆఫ్ యు...' అంది వెండీ, ఎగసిపడే గుండెల్లో దాగలేక అవస్థపడ్తోన్న అందాలలో అర్ధనారీశ్వరుడి ముడతలు పడ్డ ముఖాన్ని మృదువుగా హత్తుకుని తనని తాను మైమరచిపోతూ

అది భర్త మీద ప్రేమో, తల్లి కాబోతున్నానన్న తృప్తో, మనసు ఎక్కడో చిక్కుకోటం వలన కలిగిన వులికిపాటో ఆ భగవంతుడికే తెలియాలి. శంకరరావు మాత్రం ఆ శృంగార సాగరంలో ఈది తేలలేక నిండా మునిగిపోయారు, మెదడులో మెదులుతోన్న సందేహాల్ని ఆ ఆహ్లాదంలో సమాధి చేసి ఆదమరిచి హాయిగా కళ్ళు మూసుకుంటూ?

**(ఇంకా వుంది)**

శ్రీ సత్యాచిత్ర

# భలే తమ్ముడు

నిర్మాతలు:
సత్యనారాయణ, సూర్యనారాయణ

కథ-స్క్రీన్‌ప్లే-మాటలు-దర్శకత్వం:
పరుచూరి బ్రదర్స్

ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: యన్. వెంకట్ సంగీతం: చక్రవర్తి కెమెరా: దేవరాజ్ లక్ష్మీ ఫిలింస్

# ప్రేమించవే మనసా.

అద్దేపల్లి సుచిత్రాదేవి

ఈదురు గాలితో సన్న చినుకులుగా ప్రారంభమైన వర్షము కుండపోతగా మారి ఎడతెగక కురుస్తూనే ఉంది!



# కొత్త సీరియల్ ప్రారంభం!



**అది తుఫానుగా మారి మూడు రోజులయింది. రోడ్లన్నీ 'కాలువలా' అన్నట్టున్నాయి.**

**గాలి హోరు, వర్షపు జోరు తప్ప వీధుల్లో వాతావరణమంతా భయంకర నిశ్శబ్దము ఆవరించుకుంది.**

మధ్య మధ్యలో కన్నులు చెదిరేలా మెరుపులు, గుండెలదిరేలా ఉరుములు!

ధనవంతులు మేడల్లో హాయిగా యీ వర్షం మూలంగానైనా పనుల నుంచి విశ్రాంతి దొరికిందని అనుకున్నారు. నిత్యం క్షణం తీరకుండా బయట తిరిగే మగవారు కూడా యింటిలో తమ కుటుంబ సభ్యులందరితో ఒక చోట చేరి కబుర్లతో ఆట పాటలతో గడిపేస్తున్నారు, మధ్య మధ్య కర్టెన్స్ తొలగించి బయట వర్షాన్ని చూస్తూ.

మధ్య తరగతి వారయితే ఎటు లోకంలోని సమస్యలన్నీ వారికే ఉంటాయి కాబట్టి ఆగిపోయిన ఎన్నో పనులని తలచుకునీ, వర్షపు నీళ్ళు కారుతున్న యిళ్ళల్లో కింద పాత్రలు ఉంచుతూ ఆందోళనగా వర్షం వంక చూస్తున్నారు

ఏరోజు తిండి ఆరోజు సంపాదించుకునే ప్రాణులే అందరిలోకీ యీవర్షం మూలాన అల్లాడ పోతున్నారు బిదాబిక్కి తలదాచుకోను కూడా ఎక్కడా పొడి స్థలం దొరక్క గాలీవానలో చలికి ప్రాణాలు జివ్వు మంటుంటే, కాళీ కడుపుల్లో పేగులు మెలికలు తిరుగుతుంటే బిక్కుబిక్కు మని నీళ్ళు నిండిన కళ్ళతో వాన వంక చూస్తున్నారు

ప్రకృతికి మనిషిపై కోపం వస్తే ఎలా విలయతాండవం చేస్తుందో-చూపుతున్నట్టున్నాయి పరిసరాలన్నీ రాబోవు తుఫానుని ముందుగా ఊహించ-గలడే కానీ దాన్ని రాకుండా ఆపగలడా మానవుడు? ఆ శక్తి మానవుని మేదస్సుకి అందుతుందా?

రేడియోలో వాతావరణం గురించి వార్తలు ప్రసారమవుతూనే ఉన్నాయి ముప్పయి ఆరుగంటలు యిలాగే యీ వర్షం కొనసాగ వచ్చు అంటారు తరువాత కాదు యిక పద్దెనిమిది గంటలే అంటారు ఏమైనా యిక తగ్గుముఖం పట్టేట్టు-గానే వుంది వర్షం వార్తలు విని రేడియో ఆప్ చేసి లేచింది సస్య సమయం పన్నెండూ నలభై చూపుతుంది వాల్‌క్లాక్

బోంచేద్దామా ఆంటీ? అడిగింది

పుస్తకం పట్టుకుని కూర్చుని ఉన్న భువనేశ్వరి తలవూపి భర్తవైపు చూసింది శివశంకరం గారు కూడా మవునంగా తల వూపారు

సస్య మేడపై కెళ్ళింది

# చిన్న నవలలు రాసే వారికి మనవి !

భారతిలో వేసేందుకు చిన్న నవలలు పంపవలసిందిగా రచయిత్రులనీ రచయితలనీ కోరుతున్నాము!

ఒక్కొక నవలా సుమారు 50 అర ఠావు కాగితాలు ఉండవచ్చు!

ఒక అర ఠావు పేజీ ఇంచు మించు 20 x 30 సెంటీ మీటరులు ఉంటుంది!

సంపాదకుడు
భారతి
ఆంధ్రపత్రిక కార్యాలయం
గాంధీనగరం
విజయవాడ - 520 003

## ప్రేమించవే మనసా

గది మధ్య సోఫాలో కాళ్ళుజాపుకుని నిశ్చలంగా కూర్చునివుంది శిల్ప! తను బాగుంటుంది చదవమనిచ్చిన పుస్తకం ఒడిలో వుందే కానీ అది కనీసం తెరిచినట్లు కూడా లేదు.

గదినంతా కలయజూసింది సస్య.

కిటికీలకున్న కర్టెన్లు గాలికి యిష్టం వచ్చినట్లు పిచ్చిగా ఎగురుతున్నాయి. టేబిల్‌పై నుండవలసిన ఫ్లవర్‌వాజ్ కిందపడి పోయివుంది. శిల్ప కెంతో యిష్టమైన శకుంతలా దుష్యంతుల పెయింటింగ్ కార్పెట్‌పైన బోర్లాపడి ఉంది. పరుపు మీద యిలస్ట్రేటెడ్ వీక్లీ పేజీలు రెపరెప కొట్టుకుంటున్నాయి.

సస్య మెల్లగా ఎక్కడి వస్తువులక్కడ సర్దింది.

"ఎంతగాలి?" అనుకుంటూ కిటికీ తలుపులు మూస్తూ గార్డెన్ వైపు చూసింది. దాదాపు పూల మొక్కలన్నీ వాలిపోయి చెంచర వంచరగా ఉంది అక్కడంతా. చూపు ఆకాశం వైపు తిప్పింది.

"ఎప్పుడు తగ్గుతుందో వర్షం? భర్త పోయినా స్త్రీలా ఏడుస్తుందీ ఆకాశం!" ఏదో నవలలో చదివిన వర్ణన గుర్తుకు వచ్చింది. అది గుర్తుకు రాగానే మళ్ళీ శిల్ప వైపు చూసింది.

"తను గదిలోకొచ్చి యింతసేపైనా తనను గమనించనే లేదు. ఇలా శిలలా ఎంత సేపట్నుంచి కూర్చుని వుందో? అయినా బిగ్గరగా ఒక్క సారైనా ఏడవదేం? ఏడ్చేవాళ్ళను ఓదార్చవచ్చును కానీ యిలా లోకస్పృహ లేనట్లు వుంటే ఏమని ఓదార్చాలి? అసలు యింత నిశబ్దంగా వుంటే పలకరించేందుకే ఏదోలా వుంది!"

దగ్గరకెళ్ళి "శిల్పా!" మెల్లగా పిలిచింది.

ఉలిక్కిపడింది శిల్ప.

"భోంచేద్దాం రా!" స్నేహితురాలి ఒడిలోనుంచి పుస్తకం తీసి పక్కన పెట్టింది.

శిల్ప లేచే ప్రయత్నమేది చేయక పోవటంతో మళ్ళీ చెప్పింది. ఏదో అనబోయి మళ్ళీ సస్య వంకోక్షణం చూసి లేచింది శిల్ప. ఇద్దరూ కిందకి దిగివచ్చే-సరికి డైనింగ్ టేబుల్ దగ్గర శివశంకరం గారు కూర్చుని వున్నారు. భువనేశ్వరి వడ్డిస్తోంది.

శిల్ప ఎవ్వరి వైపూ చూడలేదు. ఏం మాట్లాడ లేదు. వాష్ బేసిన్ దగ్గరకెళ్ళి చెయ్యి కడుక్కుని వచ్చి తన కుర్చీలో కూర్చుంది.

పదార్థాలన్నీ అందరికీ అందుబాటులో ఉంచి భువనేశ్వరి కూడా కూర్చుంది.

నిముషాలు దొర్లిపోతున్నాయి. శిల్ప వూరికే అన్నం కలుపుతుంది. భువనేశ్వరి, శివశంకరం గారు కూడా ముద్ద మింగుడు పడక గొంతుకేదో అడ్డం పడుతుందన్నట్లు అన్నం కలుపుతునే వున్నారు కానీ చెయ్యి ప్లేట్లలోంచి పైకి లేవటం లేదు

ముగ్గురి వైపు చూసింది సస్య.

"ఇకనైనా ఆ మవునాన్ని తినటం ఆపేసి అన్నం తింటారా?" అన్నది.

గభుక్కున ముగ్గురూ ఒక్కసారే ఆ అమ్మాయి వంక చూసారు నవ్వింది సస్య. "మీరలా కూర్చుని భోంచెయ్యకుండా వూరికే కలుపుతుంటే నేనొక్కదాన్ని ఎలా తినటం?"

"నిజమే!" శివశంకరం గారు కూడా నవ్వేసారు.

భువనేశ్వరీ చిన్నగా నవ్వింది.

శిల్ప చప్పున ముద్దతీసి నోటిలో పెట్టుకుంది.

"హమ్మయ్య!" అనుకుంది సస్య.

"ఈ అమ్మాయి గనుక లేకపోతే మరీ యిప్పుడు యీ యిల్లు ఎలా వుండేదో?!" అనుకోకుండా ఉండలేకపోయారు భువనేశ్వరీ, శివశంకరం గారు.

సస్య వంక అభిమానంగా చూసారు.

భోజనాలైన తర్వాత శిల్ప మళ్ళీ మేడపైకి దారి తీస్తుంటే సస్య కూడా అనుసరించింది. ఇద్దరూ గదిలో కడుగు పెట్టటమూ లోపల టెలిఫోన్ మోగటం ఒక్కసారే జరిగాయి.

సస్య వెళ్ళి రిసీవర్ అందుకుంది.

"హలో..!"

అవతల నుంచి ప్రకాష్ కంఠము వినిపించింది.

శిల్ప బాల్కనీ లోకి వెళ్ళి జాజి తీగ దగ్గర నిలుచుంది. కింద నుంచి గోడ పొడవునా అల్లుకుని వున్న ఆ తీగ స్తంభాలకి గట్టిగా కట్టేసి వుండటంతో అంతటి గాలీవానని ఎదుర్కొని నిలబడి వుంది. అయినా వూగిపోతూనే వుంది. శిల్ప ఆకాశం వైపు దృష్టి సారించింది. కొద్ది కొద్దిగా తెరిపిడి పడుతూంది. గాలి వేగం కూడా తగ్గింది.

"ఎలావుంది శిల్ప?" ప్రకాష్ ప్రశ్నకి వెనక్కి తిరిగి శిల్పను చూస్తూ చిన్నగా చెప్పింది సస్య.

"గంభీరత కాస్త మరీ నిశబ్దం అయిపోయింది. అది మళ్ళీ మనలో పడేదెప్పుడో నాకర్థం కావటం లేదు."

"నిజమే. మనకే షాక్‌లా వుంది. ఇంక తన కెలా వుండాలి?"

సానుభూతి నిండి వుంది అతని స్వరంలో.

"కానీ తను కనీసం కంటతడి కూడా పెట్టటం లేదు. అలా రాయిలా

# ప్రేమించవే మనసా

వుంటుంటే నాకెందుకో భయంగా వుంది" అన్నింటికీ ఎంతో ధైర్యంగా వుండే సస్య వెలగా అన్నది.

"అంటే ఏదైనా అఘాయిత్యం చేసుకుంటుందంటావా?"

"ఛ.ఛ. తన ప్రాణాలతో ఆంటీ , అంకుల్ ప్రాణాలు ముడిపడి వున్నాయని తనకి బాగా తెలుసు!"

కొద్దిసేపు మౌనం తర్వాత అతనన్నాడు.

"తనలా వుండటం డేంజరే .పోనీ ఓ పని చెయ్యరాదూ. శామ్‌ని గుర్తుచెయ్ . అప్పుడెలా వుంటుందో చూడు. దు:ఖం ఎప్పుడూ కన్నీళ్ళ ద్వారానే బయటకు పోవాలి!"

"ప్చ్. నా వల్ల కాదు. అయినా యిప్పుడు విజ్జు వుంటే ఎంతో బాగుండేది!"

"ఎలా వస్తాడు. వర్షం తగ్గందే?"

సస్య ఏం మాట్లాడ లేదు.

"ఎక్కడుంది శిల్ప?" అడిగాడు ప్రకాష్.

"యిక్కడే!"

"మైగాడ్, తనని పక్కనేపెట్టుకుని యిదంతా మాట్లాడటం లేదుకదా?"

"చాల్లే, ఇక్కడే అంటే బాల్కనీలో . నీగొంతు నాకే సరిగా వినిపించడంలేదు. ఇక నేనెంత చిన్నగా మాట్లాడుతున్నాను."

కొన్ని క్షణాలు మళ్ళీ నిశబ్దంలో కరిగి పోయాయి.

"సస్యా !" ప్రకాష్ స్వరం మార్దవంగా ఉంది.

సస్య వింటూంది అతనేం చెపుతాడో నని.

"ఇలాంటి మంచి వర్షంలో నువ్వు...... నేనూ ప్చ్. నిన్ను చాలా మిస్సయ్యాను డియర్. అందుకే దేముడంటూ వుంటే ఒకటి కోరుకుంటున్నాను. మన పెళ్ళయిన తర్వాత యింతకన్నా పెద్దదే వర్షం అపుడపుడూ వస్తుండాలి. ఆ గాలీ , వర్షం, చీకటి నిండిన చలిలో నా చేతుల మధ్యలో నువ్వు...... "

"స్టాప్. స్టాప్" చిన్నగా అరిచింది సస్య.

"ఏం? సెన్సారా?" అతని కంఠంలో చిరుకోపం.

"నా తలకాయ! ఇక నవ్వు ఫోన్ పెట్టేసెయ్ మహాశయా!" అవతలి మాటకు ఆస్కారం లేకుండా తనే ముందు పెట్టేసింది. టెలిఫోన్ వంక మురిపెంగా చూసింది. పెదవుల మీద ముచ్చటగా నవ్వు కదిలింది.

అంతలో ఏదో గుర్తుకు వచ్చినట్లు ఓ నెంబర్ డయల్ చేసింది. అవతలి నుంచి "హలో " రజియా స్వరం.

"హాయ్ వదినా ఎలా వున్నారు?"

"బాగానే వున్నాం కానీ, శిల్ప ఎలా వుంది?"

"అలాగే వుంది. ఉలకదు, పలకదు.నేనెంత అంటిపెట్టుకుని వుండాలన్నా తను ఎంతసేపూ ఒంటరిగా ఉండిపోవాలని చూస్తుంది "

"ఏమిటో , ఒక్కోసారి ఆలోచిస్తుంటే అల్లాకి మనసు, మమత తెలియదా? అనిపిస్తుంది" జాలిగా అన్నది రజియా.

ఏం మాట్లాడ లేదు సస్య.

"మావయ్యకి నువ్వు లేకపోతే ఏం తోచటం లేదుట. ఇక మీ అన్నయ్య అయితే సరేసరి, అనుంగు చెల్లెలు లేకపోతే యింటికి కళే లేదుట!"

"మరి నీకో?" నవ్వుతూ అడిగింది సస్య.

"నిజం సస్యా, నువు లేకపోతే బోర్‌గా వుంది."

"పోదూ. యిప్పుడిలాగే అంటావు, ఓ చిన్ని సస్యను కనబోతున్నావుగా తర్వాత నాపని రామ్‌రామ్!"

"ఛట్, నీ స్థానం మరొకరికి వచ్చేది కాదు!" ముద్దుగా కసిరింది రజియా.

నవ్వుకుంది సస్య.

"అన్నయ్యా, నాన్న ఏం చేస్తున్నారు?"

"బయట కెళ్ళే వీలులేదుగా, పుస్తకాలతో నే కాలక్షేపం".

"వర్షం తగ్గగానే వస్తాను నేను. వీలయితే శిల్పని కూడా తీసుకొస్తాను."

"ఆపని చేస్తే బాగుంటుంది. శిల్పని పిలవరాదూ పలకరిస్తాను."

"లాభం లేదు మాట్లాడుతుందనుకోను. పిలిచినా మౌనంగా రిసీవర్ పట్టుకుని నిలుచుంటుందేమో. చాలాసేపయింది వదినా ఫోన్ దగ్గరకొచ్చి యిక వుంటాను."

"చాలా సేపెక్కడయింది? యిప్పుడేగా?"

"చాలాసేపంటే...." నసిగింది సస్య. "అబ్బ. అన్నీ ఆరాలు నీతో మాట్లాడితే" గునిశింది.

అర్థమయింది రజియాకు– "ఒహో! అయితే ప్రకాష్‌తో నే మాట్లాడుతావా?" అవతలి నుంచి నవ్వు వినిపించింది. చప్పున ఫోన్ పెట్టేసింది సస్య. చెక్కిళ్ళు ఎర్రబారాయి.ఒక్క నిముషమక్కడే నిలబడి తనూ బాల్కనీలోకి వచ్చింది. శిల్ప నిలుచున్న తీరు చూడగానే ఆమె మనస్థితి ఊహించుకోగానే సంతోషమంతా ఒక్కసారే ఆవిరయినట్లయిపోయింది.

మనసులో ఎన్నో ఆలోచనలు!

"నిజంగా శిల్పకిది ఎంత దెబ్బ! భగవాన్ పగవారిక్కూడా యీ శాపం వద్దు. శామ్‌ని మర్చిపోయి మళ్ళీ మామూలు జీవితంలోకి తను రాగలదా? తనెన్నుకున్న సహచరుడిని దూరం చేశావు. పోనీ అతన్ని మర్చిపోయి జీవించగలిగే శక్తినైనా దానికివ్వు!" దేముణ్ని కోరుకుంది.

శిల్ప చూపుల వెంటే తనూ కనులు తిప్పింది సస్య. శిల్ప దీక్షగా రోడ్డు పక్కన మట్టిలో కరిగి సుడులు తిరుగుతూ పారుతున్న వర్షపు నీళ్లను చూస్తుంది.

"చిన్నప్పుడయితే వర్షం కాస్త తగ్గగానే ఆ నీళ్లలో పడవలు వేస్తూ ఆడుకునేవాళ్లం కదూ!" సస్య గుర్తుచేసుకుంటూ అన్నది.

"ఓ సారి విజ్జూ చేత డాక్టరాంటీ సారీకూడా చెప్పించారు మన తగవులు చూసి"

అప్రయత్నంగానే యిద్దరి మనసులు చిన్నతనంలోకి జారాయి. ఆ రోజు జరిగిన సంఘటన కనుల ముందు మెదిలింది.

* * * *

ఓ పదేళ్ల అబ్బాయి వర్షపు నీటిలో జోరుగా పడవలు వేస్తున్నాడు. అతనికి పోటీగా తామూ పడవలు చేసి వదులుతున్నారు యిద్దరు పాపలు.

నీలం రంగు కాగితంతో పెద్ద పడవని చేసి నీటిలోకి విడుస్తూ విజ్జూ "శిల్పా, సస్యా మీవి చిన్న బోట్స్, నాది పెద్ద షిప్పు.తెలుసా? ఎలా వెళుతుందో చూడండి స్పీడుగా చక్, చక్, చక్."

సస్యకి తన తెల్లని బుల్లి పడవని చూస్తే జాలేసింది.

"పేద్ద గొప్ప, షిప్పు చక్, చక్‌మనా వెళుతుంది?" ప్రశ్నించింది. శిల్ప పెద్ద కళ్ళు రెప రెపలాడిస్తూ, "మరెలా వెళుతుంది" అడిగింది అమాయకంగా. ఆగిపోయిన తన పడవను జరుపుతూ.

"ఎలా అంటే... ఎలా అంటే..." ఏం చెప్పాలా అని ఆలోచిస్తున్న సస్యకి అల్లంత దూరంలో విజ్జూ పడవ మునిగి పోవడం కనిపించింది.

"మునిగిపోయిందోచ్, షిప్పు పని గోవిందా! "కిల కిలా నవ్వింది. విజ్జూ చిన్నబోయాడు.

"పాపం, విజయ్‌కుమార్‌గారి షిప్పు కాస్తా మునినిగిపోయిందోచ్" మళ్ళీ వెక్కిరింతగా అన్నది సస్య.

శిల్ప కూడా నవ్వింది.

విజ్జూకి రోషం వచ్చేసింది. "దానికి సస్య అని పేరు పెట్టాను. అందుకే అది మునిగిపోయింది!" తనూ ఎగతాళిగా అన్నాడు.

సస్య కోపంగా అరిచింది. "అంతా అబద్ధం. మునిగిపోయిన తర్వాతే అంటున్నావిలా!"

విజ్జూ ఒక్కక్షణం సస్య వంక చూసి మెరుపులా సస్య చేసుకున్న పడవలు, యింకా పక్కనున్న కాగితాలు అన్నీ విసురుగా నీళ్ళలోకి విసిరేసాడు.

ఊహించని హఠాత్సంఘటనకి సస్య ముందు తెల్లబోయింది. ముఖమంతా వెంటనే కందిపోతుండగా ఏడుపు వచ్చేంత పనయింది. సస్యకి ఎక్కువ కోపం వస్తే పూర్తిగా సీరియస్ అయిపోతుంది. అంతేకానీ అరవదు, ఏడవదు. ఇప్పుడూ అలాగే ఏం మాట్లాడకుండా గిరుక్కున వెళ్ళి తమ యింటి ముందు వరండా మెట్ల మీద కాళ్ళు ముడుచుకు కూర్చుంది. శిల్పకి గొడవలంటే యిష్టం వుండదు. ఇప్పటి తగవులో విజ్జూదే తప్పనిపించింది. అందుకే తనూ విజ్జూ వైపు కోపంగా చూసి సస్య జట్టన్నట్లు వెళ్ళి స్నేహితురాలి పక్కన కూచుంది.

ఇద్దరూ అలా వెళ్ళిపోవటం విజ్జూకి మరీ ఉక్రోషం వచ్చింది. ఒక వైపు బాధగా కూడా వుంది.

"నాతో మాట్లాడరా యిక?" అడిగాడు.

సస్య కోపంగా ముఖం అటు తిప్పేసుకుంది. శిల్ప కూడా అలాగే చేసింది.

"నాతో ఆడుకోరా యిక?" కళ్ళల్లో నీళ్ళు రాబోతున్నాయి.మళ్ళీ అమ్మాయిల నుంచి అదే తిరస్కారం ఎదురయింది. విజ్జూ కోపంగా ఏదో అనబోయేంతలో ఎదురింట్లో నుంచి విశాలాక్షి గేటు తీసుకుని వచ్చింది.

"ఏమిటి ఏదో యుద్ధం జరుగుతున్నట్లుంది?" నవ్వుతూ అడిగింది.

ఎవ్వరూ ఏం మాట్లాడలేదు.

"నేనంతా కిటికీలోంచి చూస్తూనే వున్నాను. సస్య వెక్కిరించిందే అనుకో. కానీ నువ్వలా చెయ్యొచ్చా విజ్జూ, తప్పుకదూ?" కొడుకును మందలించింది.

""అది కాదు మమ్మీ, మరి ..." మధ్యలో నే ఆపింది.



# కొత్త లిరిల్
# ఇది తాజాదనపు సరికొత్త అనుభూతి!

లిరిల్ కొత్తదిగా మారింది!
నిలిచి గుబాళించే కొత్త సువాసనతో...
ఆకర్షణీయమైన కొత్త ప్యాక్‌లో!







కొత్త
**లిరిల్**
తాజాదనపు సబ్బు

మిమ్మల్ని నవనారిగా రూపొందిస్తుంది

హిందూస్థాన్ లీవర్ వారి

## పరిమళం

గుండెలో పొంగే అనురాగం
గొంతులో రాగమై మ్రోగినప్పుడు
ఎదలోని ఆనంద గరిమ
పెదవిపై చిరు నవ్వుగా మెరిసినప్పుడు
మనసులోని మమతా మధురిమ
మాటలో తేనెగా చిందినప్పుడు
బ్రతుకులోని మంచితనం
మానవతా సుమమై పరిమళింపదా?

–వేముగంటి నరసింహాచార్యులు

# ప్రేమించవే మనసా

"సస్య పడవలన్నీ నీళ్ళలో వేసేసావుగా. ముందు సారీ చెప్పు!" ఆదేశించింది.

శిల్ప, సస్య లేచి విశాలాక్షి దగ్గరకు వచ్చారు. సస్యకు విజ్జూ బిక్కముఖం చూస్తే జాలి వేసింది. "వద్దులే ఆంటీ వెక్కిరించటం నాదేగా తప్పు" అన్నది.

అంతలో విజ్జూ విశాలాక్షి వైపొకసారి చూసి ఎవరినీ ఉద్దేశించినట్లుకాక "సారీ!" అని మెల్లగా అనేసి పరుగెత్తుకుంటూ యింట్లోకి వెళ్ళిపోయాడు.

సస్య, శిల్ప, విజ్జూ వెళ్ళిన వంకే చూస్తూ బొమ్మల్లా నిలబడిపోయారు.

విశాలాక్షి నవ్వుకుంటూ కొడుకు వెంట లోపలికి వెళ్ళింది. అయిదు నిముషాల తర్వాత విజ్జూ బయటకు వచ్చాడు నవ్వు ముఖంతో. చేతినిండా చాక్లెట్లతో!

సస్యే ముందు విజ్జూ చెయ్యి పట్టుకుని పలుకరించింది. కొద్ది సేపటికి మళ్ళీ ముగ్గురూ ఒక్కటైపోయి ఆటల్లో పడ్డారు.

*   *   *   *   *   *

విసురుగా వీచిన గాలికి సన్నని జల్లు శరీరాలను తడపడంతో సస్య, శిల్ప యిద్దరూ రెండడుగులు వెనుకకు వేసారు. చిన్ననాటి జ్ఞాపకం లోంచి ప్రస్తుతంలోకి వస్తూ.

"అబ్బ, చలిబాబూ!" సస్య గదిలోకి నడిచింది. వెనుకే శిల్ప కూడా వచ్చింది.

"ఏమైనా వర్షం నిన్నటి కన్నా తగ్గింది కదూ?" సస్య అడిగిన దానికి శిల్ప అవుననో, కాదనో అన్నట్లు తల ఊపింది. స్వెట్టరు తీసేసి సోఫాలో వెనక్కి వాలి కూచుంది సస్య.

"టేప్ రికార్డరు పెట్టుకుందాం. నీకేం కావాలి?" అడిగింది శిల్పను.

"నీ యిష్టం!" ఆ రోజుకంతా అప్పుడు పెదవి విప్పింది శిల్ప.

"కృష్ణశాస్త్రి ఎటు పోయినట్లు?" పైకి అనుకుంటూ కేసెట్స్‌లో వెదుకుతూ అన్నది సస్య.

"కృష్ణశాస్త్రి వద్దు" శిల్ప తొందరగా అన్నది. అందులో "రానిక నీకోసం చెలీ!" పాట వస్తుంది. అది విని భరించే శక్తి తనలో లేదు, అనుకుంటూ మనసులో. సస్య వెతికి వెతికి ఓ కేసెట్ అమర్చి ఆన్ చేసింది. ఇరవయ్యేళ్ల కిందటి తెలుగు సినిమా పాటలు అవి. హాయిగా జోకొట్టేట్లున్న మధుర సంగీతం!

ఒకసైడు పాటలన్నీ విని టేప్‌రికార్డర్ ఆఫ్ చేసింది. శిల్ప వైపు చూస్తే "లోన్లీ లేడీ" ముఖంకు అడ్డుగా కనిపించింది. చదువుతుందో లేదో తనకే తెలియాలి. సస్యకూడా లేచి ఓ నావల్ తెచ్చుకుని కూచుంది. కొద్ది సేపటికే అందులో పూర్తిగా లీనమయిపోయింది.

*   *   *   *

మరునాటికి గాలీ, వర్షమూ పూర్తిగా తగ్గాయి.

"హమ్మయ్య!" అనుకుంటూ సూర్యుడు తన డ్యూటీకి వచ్చేశాడు. నాలుగు రోజులు తను ముఖం చూపించకపోయేసరికి యింత బీభత్సమా? అని ఆశ్చర్యంగా చూస్తున్నాడు వాలిపోయిన చెట్ల వంకా, పాడయిపోయిన రోడ్ల వంకా.

వర్షంలో వణికిన ప్రకృతి వెచ్చగా ఎండలో చలికాచుకోవటం ప్రారంభించింది.

కారణాంతరాల వలన మధ్యలో ఆగిపోయిన పెళ్ళిల్లులా స్తబ్దుగా వున్న లోగిలిలో పెళ్ళి మళ్ళీ కుదిరి ఒక్కసారిగా భజంత్రీలు మారుమ్రోగినట్లూ, పెళ్ళివారిలా హడావుడి పడిపోతున్నారు జనమంతా. ఆకలితో, చలితో ముడుచుకు కూర్చునివున్న ముష్టివాళ్ళు గిన్నెలతో, డబ్బాలతో ఒక్కసారిగా నగరంపై దాడి చేస్తున్నారు. వాళ్ళేకాదు అందరూ విడుదల పొందిన ఖైదీల్లా యిళ్లలోంచి బయటకు వస్తున్నారు. మార్గాలు బాగున్నంతవరకూ చుట్టుపక్కల వూర్లకి బస్సులు బయలుదేరాయి.

"విజ్జూ యికనైనా వస్తే బాగుండును. అత్తయ్యావాళ్ళ వూరికని వెళ్ళి అత్తగారింట్లోలా తిష్ట వేసుక్కూర్చున్నట్లున్నాడు. ట్రంకాల్ చేద్దామన్నా అటువైపు లైన్సు పాడయి ఉన్నాయట!" అనుకుంది సస్య. భువనేశ్వరి దగ్గరకెళ్ళి యిక తాను యింటికి వెళతానని, వెంట శిల్పనీ పంపించమని అడిగింది.

"శిల్ప వస్తానన్నదా?" అడిగింది భువనేశ్వరి.

"ఎందుకు రాదూ?" అంటూ శిల్పకు చెప్పింది బయలుదేరమని.

"ఇప్పుడు కాదు!" శిల్పకు నలుగురిలోకి వెళ్లాలనిలేదు.

"నేను వచ్చి నాలుగు రోజులు పైనే అయింది. వదిన రమ్మంటుంది. నిన్ను కూడా తీసుకురమ్మని మరీ మరీ చెప్పింది."

భువనేశ్వరికి కూడా అదే బాగుంటుందనిపించింది.

"పోనీ వెళ్ళు శిల్పా! సందడిగా వుంటేనే బాగుంటుంది. అంతగా అయితే రేపు డాడీ వస్తారు వచ్చేదువుగానీ". చెప్పింది కూతురితో.

శిల్పకి వాళ్ళతో వాదించుతూ కూర్చోవాలని లేదు! శివశంకరంగారితో చెప్పడానికి వచ్చారు రడీ అయి "వెళుతున్నట్లు". సస్య చేతిలోని కారు తాళాలు చూసి "నీ డ్రయివింగా? రోడ్లు మొదలే బాగా లేవు". అన్నారు.

"డ్రైవర్ని తీసుకెళ్ళకూడదూ?"

"నేను డ్రైవ్ చేస్తుండగా మీరెప్పుడూ కారెక్కలేదు. అందుకే యిలా అంటున్నారు." ధీమాగా అన్నది సస్య.

"బాధ్యతలన్నీ తీరిన తర్వాత కృష్ణా, రామా అనుకుంటూ ఎక్కుతానులేమ్మా నీ కారు!" కావాలని నవ్వుతూ అన్నారు ఆయన.

"అంటే! నమ్మకం లేదనేగా నా డ్రయివింగ్‌పై. చూడండి ఆంటీ, అంకుల్!" బుంగమూతి పెట్టింది సస్య.

"ఆయన కంతా వేళాకోళమేగా, క్షేమంగా వెళ్ళండి" భువనేశ్వరి నవ్వుతూ అన్నది.

"టాటా" సస్య వుషారుగా కారు దగ్గరకు నడిచింది. ఆ అమ్మాయి వెంట ఉదాసీనంగా, నిర్లిప్తంగా అన్నట్లు వెళుతున్న శిల్పని చూసి అప్రయత్నంగా నిట్టూర్చింది భువనేశ్వరి.

"మంచికో చెడుకో జరిగిందేదో జరిగిపోయింది. శిల్ప ఆ అబ్బాయిని మర్చిపోయి మళ్ళీ మామూలుగా తిరిగేదెపుడో!" ఆవేదనగా అనుకుంది.

**(ఇంకా ఉంది)**



# సినిమా విశేషాలు

-జి.వి.జి.

## తాతినేని ప్రసాద్, మోహన్‌బాబు కాంబినేషన్‌లో ఎ. ఆర్. ఆర్. పిక్చర్స్ చిత్రం

"మోహన్‌బాబుది డ్యుయల్ రోల్ ఫిబ్రవరి 4 నుంచి 20 వరకు ఫస్ట్ షెడ్యూల్ జరిపాం మార్చి 1 నుంచి 20 వరకు జరిగే మలి షెడ్యూల్‌తో మొత్తం షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు తాతినేని ప్రసాద్ ఈయన దర్శకత్వంలో కె ఎల్ ఎన్ ఎస్ రామచంద్రరాజు నిర్మించే ఎ ఆర్ ఆర్ పిక్చర్స్ ద్వితీయ చిత్రంలో శారద భానుప్రియ, సత్య-నారాయణ, రాళ్ళపల్లి, స్మిత, అనూరాధ ఇతర తారాగణం మోదుకూరి కథ, గణేశ్ పాత్రో మాటలు, రాజ్- కోటి సంగీతం, బిపిన్‌దాస్ ఛాయ, కె రామ-లింగేశ్వరరావు శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పు, కె వెంకట్రాముడు నిర్వహణతో కె ధ్రువ-కుమార్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ కె వెంకట్రామరాజు సమర్పిస్తారీ చిత్రాన్ని నిర్మాణ సారథ్యం ఎస్ అచ్యుతరామరాజు సహ దర్శకత్వం గూనా నాగేంద్ర ప్రసాద్

## త్వరలో విడుదలయ్యే "రామరాజ్యం వచ్చింది"

'మారుతున్న సమకాలీన రాజకీయ వాతావరణానికి, జరుగుతున్న కొత్త చరిత్రకు సామాన్యుని లోత గుండెల్లో జనిస్తున్న విప్లవభావాలకు ప్రతిరూపంగా తయారైన రామరాజ్యం వచ్చింది చిత్రానికి ఇటీవలే అరుణాచలం స్టూడియోలో పాచ్‌వర్క్ పూర్తిచేశాం మారిన కాలానికి, మారుతున్న ప్రేక్షకాభిరుచులకు అనుగుణంగా ప్రాచ్య ప్రాశ్చాత్య సంగీతాలలో దిట్ట అయిన ఎస్ రాజేశ్వరరావుగారు చక్కని బాణీలు వినిపించిన చిత్రం, అన్నారు నిర్మాత వాసిరాజు ప్రకాశం జయశ్రీ చిత్ర పతాకంలో తయారయిన పై చిత్రంలో చంద్ర మోహన్, ప్రభ, గొల్లపూడి మారుతీరావు, నూతన్ ప్రసాద్ ప్రభృతులు ముఖ్య భూమికలు నిర్వహించారు. ఆత్రేయ, సి నారాయణరెడ్డి, డాక్టర్ నెల్లుట్ల గీతాలు రాశారు తుమ్మలపల్లి రామసత్యనారాయణ సమర్పించే ఈ చిత్రానికి నరసింహారావు రేలంగి దర్శకుడు

## చిరంజీవి ద్విపాత్రాభినయంతో పి. ఎన్. ఆర్. పిక్చర్స్ "జ్వాల"

"చిరంజీవి సరసన రాధిక, భానుప్రియ నాయికలు. సత్యనారాయణగారిది మరో మరపురాని డైనమిక్ కేరెక్టర్," అన్నారు పింజల నాగేశ్వరరావు ఈయన నిర్మించే "జ్వాల చిత్రం షూటింగ్ పూర్తి కావస్తోంది. ఇళయరాజా సంగీతం, లోక్‌సింగ్ ఛాయతో పిని శెట్టి రవిరాజా దర్శకుడు

## "నీకూ కూతురు పుడితే?"

ఫిబ్రవరి మార్చి, ఏప్రిల్ నెలల్లో 1-10 తేదీల మధ్య మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు కాకర్ల కృష్ణ ఉగ్రరాణి ఆర్ట్స్ బానర్‌లో తయారయ్యే పై చిత్రంలో నరేష్, శరత్ బాబు, లక్ష్మి, శ్రీప్రియ, వీరభద్రరావు వగైరా తారాగణం దాసం గోపాలకృష్ణ మాటలు, చక్రవర్తి సంగీతం, బాబూరావు ఛాయ, శ్రీనివాసరాజు శిల్పంతో రేలంగి నరసింహారావు దర్శకుడు కాకర్ల కృష్ణ రమేష్ నిర్మాతలు

## "సూపర్ బాయ్" 3–డి చిత్రం.

ఛాయాగ్రహణంతో పాటు డైరెక్షన్‌ని కూడా రవికాంత్ నగాయిచ్‌కు అప్పగించాం, అన్నారు బి ఆర్ రెడ్డి ఈయన గృహలక్ష్మి అనంతరం నిర్మించే పై 3–డి చిత్రంలో సుజాత, అనూరాధ, శరత్‌బాబు, జయప్రద సోదరుడు రాజబాబు, బాంబే రాజా ప్రభృత నటవర్గం ఆర్ కె ధర్మరాజు కథ, స్క్రీన్‌ప్లే రాశారు ఆత్రేయ గీతాలకు ఎం. ఎస్ విశ్వనాథం స్వరకర్త

"కిలాడి"లో అంబిక, కమలహాసన్



## ఆప్కో అందాల కలగలుపు
## మీ సౌందర్యాలకు మేలుకొలుపు




# చేనేతలు

కంటికి కనపడని నిగూఢమైన మీ సౌందర్యాలు ఆప్కో చీర కట్టగానే బహిర్గతమవుతాయి. అందరి చూపులూ ఆకట్టుకుంటాయి. ఆప్కో చీరల హుందాతనం మీ అందాలకు మూలధనం. ఆప్కో ప్రతి చీర మీ కోసమే ఎదురు చూస్తూ వుంటుంది. పలకరించండి! కట్టి పులకరించండి!




**ది ఆంధ్రప్రదేశ్**
**స్టేట్ హేండ్లూం వీవర్సు**
**కోఆపరేటివ్ సొసైటి లిమిటెడ్**
**హైదరాబాద్-500 029**

kiron/apco/84 g2

# సినిమా

## మోహన్‌బాబు, కె. ఎస్. ఆర్. దాస్ కాంబినేషన్‌లో "నేరస్థుడు" మార్చి విడుదల

"1928 ప్రాంతంలో కర్నాటక రాష్ట్రంలోని 'కాగోడు' అనే ప్రాంతంలో జరిగిన ఒక యదార్థ గాథను గత సంవత్సరం జనవరి నెలలో ఒక ఆంగ్ల దినపత్రిక వెలుగులోకి తెచ్చింది. ఆ కథను మూలాంశంగా మా హీరో మోహన్‌బాబు కథ, స్క్రీన్‌ప్లే తయారు చేయడమే కాకుండా– ఓ భూ కామందు దౌష్ట్యానికి బలియై, తిరిగి పుంజుకుని, ఎవరైతే తనను నేరస్థుడని నిలబెట్టారో అతడే నేరస్థుడని నిరూపించిన ఓ ధీరోదాత్త యువకుని పాత్రలో జీవించారు." అన్నారు కె. ఎస్. ఆర్. దాస్. ఈయన దర్శకత్వంలో కె. సుకుమార్ నిర్మించిన సుకుమార్ ఆర్ట్స్ "నేరస్థుడు" చిత్రంలో మాధవి నాయిక. సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, కాంతారావు, నూతన్‌ప్రసాద్, రాళ్లపల్లి, కె. కె. శర్మ, సత్తిబాబు, హరిబాబు, ప్రసాద్‌బాబు, టెలిఫోన్ సత్యనారాయణ, అన్నపూర్ణ, అత్తిలి లక్ష్మి, మమత, కాకినాడ శ్యామల నటించారు. సత్యానంద్, వేటూరి, సత్యం, రంగారావు, కృష్ణ, డి. వెంకటరత్నం, రవిరాజ్ ప్రభృతులు తెరవెనుక కృషి చేశారు.

## "పులిపంజా"లో పేరాశ

మధుసూదనరావు (వీరభద్రరావు) వద్దకు కామయ్య (వేలు) ఆదరాబాదరాగా వచ్చాడు. "మీరే రక్షించాలి. మీరే కాపాడాలి. మా ప్రేమకు, మీ పరిశోధన్‌తో పెళ్లి జరిపించక పోతే ఉరేసుకుంటానంది. అయ్యా, నాకున్నది ఒక్కగా నొక్క కూతురు. ఎలాగైనా ఈ పెళ్లి జరిపించాలి. ఇవి చేతులుకావు," అంటూ ప్రాధేయపడ్డాడు.

"ఛీ– ఛీ! నీకేమైనా బుద్ధుందా? బంగారంలాంటి చేతులు పట్టుకొని, చేతులు కాదంటావ్?" అంటూ మధుసూదనరావు స్ప్రింగ్‌లా ఎగిరాడు చెట్టుకొమ్మ మీదికి.

కామయ్య ధోరణి మార్చాడు. "ఆఁ... ఆడపిల్ల తండ్రినని నీ పాదాలు పట్టుకొని ప్రాధేయపడితే, చెట్టెక్కుతావా? మర్యాదగా క్రిందికి దిగి వచ్చి మాట్లాడు. నా కూతుర్ని బ్రతికించు".

"సరె... నువ్వంతగా బ్రతిమలాడుతున్నావ్ గనుక కోటి రూపాయలు కట్నం ఇవ్వు... అవునయ్యా కోటి కొక్కడు నా కొడుకు. కోటికి పడగెత్తాలని ఎప్పటి నుంచో కలలు కంటున్నాను."

"నువ్వు కంటున్నది పీడకల... తగ్గవు... రేటు తగ్గవు... చెట్టు దిగవు... ఎన్నాళ్ళుంటావా చెట్టు మీద? ఎర్రగండు చీమలు పీకుగాక. తొండలు, బల్లులు, కాకులు రెట్టవేయుగాక! ఇదే నా శాపం" అంటూ కామయ్య చుర చుర చూసాడు.

మధుసూదనరావు చివాలున భరతనాట్యం చేయనారంభించాడు. "నాలుక ముచ్చుల వెధవ! నిజంగానే పీకుతున్నాయ్... ఇష్యూ– ఇష్యూ!" అంటూ చేతులు దులుపుకుంటూ చెట్టు దిగాడు.

కె. మహేంద్ర సమర్పణలో కె. హేమాంబరధరరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించిన ప్రతిమా పిక్చర్స్ "పులిపంజా" చిత్రం త్వరలో విడుదలవుతుంది.



భానుప్రియ, "అమెరికా అల్లుడు"లో

## "అనురాగ బంధం"

"చక్కని ఫామిలీ సెంటిమెంట్." అన్నారు ఎన్. రామలింగేశ్వరరావు. ఈయన "కిరాయి కోటిగాడు, కంచు కాగడా" అనంతరం నిర్మించే రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "అనురాగ బంధం"లో జయసుధ, శరత్‌బాబు, సరిత ఆదిగా గల వారు ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. రాజన్-నాగేంద్ర సంగీత దర్శకులు. పి. చంగయ్య ఛాయా గ్రాహకుడు. అనిల్ కుమార్ దర్శకుడు. "ఫిబ్రవరి 26 నుంచి షూటింగ్." అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే నందిగం దేవీప్రసాద్.

# సినిమా

## మార్చిలో విడుదలయ్యే "ఓ తండ్రి తీర్పు"

"మురళీమోహన్ ఇదివరకు నటించిన పాత్రలన్నీ ఒక ఎత్తు; 'ఓ తండ్రి తీర్పు' చిత్రంలోని పాత్ర ఒక ఎత్తు. ఇంత కాలానికి ఆయన ప్రతిభా విశేషాలను ప్రదర్శించడానికి తగిన పాత్ర లభించింది. ఆ అవకాశంతో విజృంభించారు. ముఖ్యంగా ఇద్దరు కొడుకుల తండ్రిగా సంఘర్షణాయుతమైన పాత్రను ఎంతో అవలీలగా, పట్టుదలతో పోషించారు. ఆయన భార్యగా జయసుధ నటనలో మరో మెట్టు ఎక్కింది," అన్నారు రాజాచంద్ర. ఈయన దర్శకత్వంలో మాగంటి వెంకటేశ్వరరావు నిర్మించే జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్ "ఓ తండ్రి తీర్పు"లో సాయిచంద్, బాలాజీ, సత్యనారాయణ, ఈశ్వరరావు, కమలాకర్, గిరిబాబు, ప్రభాకరరెడ్డి, వేలు, వీరభద్రరావు, రాజ్యలక్ష్మి, సంయుక్త, కె. విజయ నటించారు. మురళీమోహన్ సమర్పించే ఈ చిత్రానికి గణేశ్‌పాత్రో మాటలు, చక్రవర్తి సంగతం, కె. శ్రీహరి ఛాయ, తార నృత్యాలు, రాజగోపాల్ కూర్పు, సాహుల్ సాహసాలు, బి. సుబ్బారావు ప్రొడక్షన్, ఏ. కృష్ణమోహన్- అమరేశ్వరరావు సహకార దర్శకత్వం నిర్వహించారు. "మార్చిలో విడుదలవుతుంది," అన్నారు నిర్మాణ సారధి కిశోర్.



అందరూ తీసే పద్ధతిలో కాకుండా మనం కొత్తగా తీయాలి. అందుకే మన సినిమాని 4-డి లో తీయమంటున్నా.

# మీ పెట్టుబడి రక్షణకు, మీ కుటుంబ క్షేమానికీ యుఎల్ఐపి



## ULIP ఒక్కటే మార్గం

యు.ఎల్.ఐ.పి. (యూనిట్ లింక్డ్ ఇన్సూరెన్స్ ప్లాన్)ని ఒక్కసారి బాగా పరీక్షించండి.

వైద్య పరీక్షతో నిమిత్తం లేకుండానే, అనుకున్న మొత్తానికి, మీకు జీవిత బీమా రక్షణ దొరుకుతుంది.

ఇంకా, అపాయాల సందర్భంలో, రూ. 15,000 ల దాకా మీకు రక్షణ లభిస్తుంది.

అంతేగాక, మీ పెట్టుబడిమీద మంచి ఫలసాయం వస్తుంది.

పైగా, మీరు వేసిన మొత్తంమీద రాబడి పన్నులో మినహాయింపు వుంటుంది.

18 సంవత్సరాల నుండి 45½ సంవత్సరాల మధ్య వయస్సులో వుంటే, మీరు యు.ఎల్.ఐ.పి. పథకంలో చేరవచ్చు. రూ. 3,000/- కనీస మొత్తం నుండి రూ. 12,000/- గరిష్ట మొత్తం వరకు, 10 నుండి 15 ఏళ్ళ వరకు.

మొదటిసారి చేరిన మూడేళ్ల తర్వాత, మళ్లీ రూ. 12,000/- లకు కొత్త పథకాన్ని తీసుకోవచ్చు.

ఇతర వివరాలకు, మా ఏజెంట్లనుగాని, ముఖ్య ప్రతినిధులనుగాని, మీకు దగ్గరలో నున్న బ్యాంక్ ఆఫ్ బరోడా శాఖను గాని సంప్రదించండి.




**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

(ప్రభుత్వ రంగంలోని ఆర్థిక సంస్థ)

హెడ్ ఆఫీస్, బొంబాయి-20

ప్రాంతీయ కార్యాలయం: 'రెజీనా మ్యాన్షన్', 46, సెకండ్ లైన్ బీచ్, మద్రాస్-600 001. టెలిఫోన్: 27433
ఆంధ్రప్రదేశ్ కార్యాలయం: 27/11/6B, మేరీ స్ట్రీట్, గవర్నర్‌పేట, విజయవాడ-520 002 టెలిఫోన్: 63964
ఆంధ్రప్రదేశ్‌లో మా ముఖ్య ప్రతినిధి:
కె.బి. తిలక్, లియో సర్వీసెస్, 13, అంజుమన్ బిల్డింగ్ (లాలాపేట పోలీస్‌స్టేషన్ దగ్గర), గుంటూరు-5220 03 టెలిఫోన్: (O) 23439 ● యర్రమిల్లి సోమసుందరరావు, నేతాజీ ప్రెస్, మెయిన్ రోడ్డు, తణుకు-534 211 ఫోన్: (R) 106 ● సి. నారాయణస్వామి, 15-5-4, శైలేశ్వరసేన్ రోడ్డు, కృష్ణ నగర్, మహారాణిపేట, విశాఖపట్టణం-530 002.

**మీ మిగులు ధనాన్ని – యూనిట్ యూనిట్‌గా పెరగనివ్వండి!**

20 YEARS OF TRUSTED SERVICE

Sista's-UTI.242.84 TE R




(గత సంచిక తరువాయి)

రమేష్ చెప్పినట్లుగానే సాయంత్రం హాస్పిటల్లో పని తొందరగా ముగించుకొని అనిత ఇంటికి వచ్చాడు. అయితే అతడు అనుకున్నట్లుగా అనిత అతడి కోసం ఎదురు చూస్తూ కనిపించలేదు.

మూర్తీభవించిన శోక దేవతలా వుంది.

"అనితా, ఏమయింది? ఎందుకలా వున్నావు?" ఆమెను చూడగానే ఆందోళనగా అడిగాడు రమేష్.

'విజయ్ వచ్చి ఏదైనా గొడవ చేశాడేమో....' అనుమానం వచ్చింది అతడికి.

"ఏమయిందని చెప్పను? నాకు ప్రాణం పోకుండా వుండడమే ఆశ్చర్యంగా వుంది రమేష్. నన్ను నిర్జీవిలా చెయ్యాలని విజయ్ ఆలోచన. . నా మనసు మీద గట్టి దెబ్బ వేశాడు. ఈ దెబ్బ లింక పడకుండా వుండాలంటే నీవు... ఇక్కడికి రాగూడదు."

"అనితా, ఏమిటి నువ్వనేది?" ఆశ్చర్యంగా అన్నాడు రమేష్.

"మన అనుబంధాన్ని లోకం వక్రంగా చూసేలా మన పేర్లు పేపరు కెక్కించాడు విజయ్...." అనిత పేపరు వార్త చెప్పగానే స్థాణువయ్యాడు రమేష్.

విజయ్ అలా చేశాడంటే నమ్మలేక పోతున్నాడు.

అనిత అంటే విజయ్ కెంత ప్రాణమో అతడికి తెలుసు.

"విజయ్ దగ్గరికి వెళ్ళి అడిగివస్తాను అతడెందుకలా చేశాడో..." అన్నాడు ఆశ్చర్యం నుండి పూర్తిగా తేరుకోకుండానే.

"నేను ప్రొద్దునే వెళ్ళాను. అతడు నువ్వే ఆ పని చేశావన్నాడు."

"అనితా...."

"విజయ్ ఇలా చేస్తాడని నేను అనుకోలేదు రమేష్. అతడు నన్ను తన కాళ్ళ మీద పడేలా చెయ్యాలనుకున్నాడు అతడేమైనా అంటే మన మీదే బురద చల్లుతాడు. అతడితో మాట్లాడి మనసును మరింత కలత పెట్టుకోవడం తప్ప లాభంలేదు." దుఃఖం ఆవేశం పెనవేసుకొస్తున్నాయి అనితకి.

"మనం ఇప్పుడేం చెయ్యాలి?" ఆలోచిస్తూ అన్నాడు రమేష్.

**జరిగిన కథ 7 : అనితకు ఆరోజు శుభప్రదమైన రోజు. భర్త విజయ్ రాకకై ఎదురు చూస్తున్న అనితకు రమేష్ రాక నిరాశ కలిగించింది. "ప్రముఖ రచయిత్రి అనితాదేవి అసలు రూపం" అని ఎవరో పేపర్లో వేయిస్తే ఆపని విజయే చేసి ఉంటాడని అతడిని నిలదీసి అడుగుతుంది అనిత. విజయ్‌కు గతం గుర్తుకు వస్తుంది– అనిత వితంతువని తెలసినా విజయ్ ఆమెను వివాహం చేసుకొంటాడు. అనిత అత్త కొడుకు రమేష్ వల్ల విజయ్ అనితల మధ్య మనస్పర్థలు బయలు దేరాయి. అనిత మేనత్త చనిపోయింది. అనిత విజయ్‌ను వదిలేసి తండ్రి దగ్గరకు వచ్చేసింది. అనిత తండ్రి ఆటో యాక్సిడెంట్‌లో మరణించారు. అనితకు ఎంత నచ్చచెప్పినా విజయ్‌తో రాను ఆమె నిరాకరించింది. మ్యారేజ్ డే రోజే పేపరులో ఇలాంటి వార్త రావటం చూసి అనిత ఎంత బాధ పడుతోందో అని తన ఫ్రెండ్సుతో అంటాడు విజయ్. అతనికి ఇప్పటికీ భార్య అంటే అమితమైన ప్రేమ.**

"జరిగిన దానికి వగచి లాభంలేదు. ఈ అవమానాగ్ని ఇంతటితో ఆరిపోవాలంటే నీవు ఇక్కడికి రాగూడదు. మనం ఎప్పుడూ ఎక్కడా కలుసుకోకూడదు."

"అనితా...."

"క్షమించు రమేష్. లోకం మనమీద అనుమానం పెంచుకో కూడదు. అందుకే ఇలా అంటున్నాను...." అంటూ అక్కడి నుండి వేగంగా వచ్చింది అనిత.

'తను అక్కడే వుంటే అతడు వెళ్ళడు' పెరట్లోకి వెళ్ళి తులసి గట్టుమీద కూర్చుంది.

'తన ఆనందమే అతడి ఆనందంగా భావించే రమేష్‌ను తను ఎంత గొప్పగా ఆదరించింది....' బాధగా అనుకుంది

'కాని తను రమేష్ కామాట చెప్పకపోతే లోకం దృష్టిలో తన నేరం పెరుగుతూ వుంటుంది...' ప్రొద్దుటి నుండి జరిగిన అనుభవాలు ఆమెకా విషయం స్పష్టం చేశాయి

ప్రొద్దున విజయ్ ఇంటి నుండి రాగానే కాలేజికి వెళ్ళాలనుకుంది. కాని ఆగని దుఃఖంతో కాలేజిలో వాళ్ళ మాటలకు సమాధానం చెప్పలేననిపించింది. గదిలోకి వెళ్ళి పడుకుంది.

'ఈ అవమానాన్నెలా భరించడం?' విజయ్‌తో తనేం భయపడ నన్నట్లుగా మాట్లాడింది కాని అది అసాధ్యమని తనకు తెలుసు.

తోటి లెక్చరర్ల ముందు ముఖ్యంగా స్టూడెంట్స్ ఎదుట ఎలా తిరగడం?

"ఏమిటీ వార్త?" అని వాళ్ళు అడిగితే ఏం చెప్పాలి?

అది అబద్ధం అంటే వాళ్ళు నమ్ముతారా?

రమేష్‌తో తను కలిసి తిరగడం వాళ్ళు చాలాసార్లు చూశారు. రమేష్ అమెరికా వెళ్ళి వచ్చాడని తనే స్నేహితులకు, కొందరి విద్యార్థులకు గూడా చెప్పింది. ఈ పేపరు చూడగానే వాళ్ళు తనను అసహ్యించుకొని వుంటారు. బేలగా ఏడుస్తోంది.

'తనవారంటూ మిగిలిన వారు రమేషే. జీవితంలో రెండుసార్లు దెబ్బతిన్న తనకు అతడి అభిమానం కొండంత ధైర్యాన్నిచ్చింది. కాని తను తెలివిహీనురాలు. అతడితో సన్నిహితత్వం లోకానికి అనుమానం కలిగిస్తుందన్న ఆలోచన రాలేదు.. ' తనను తనే నిందించుకుంటూ ఏడుస్తున్న అనిత "మీకోసం ఎవరో వచ్చారు." అని అనసూయమ్మ చెప్పడంతో కండ్లు తుడుచుకొని గది వెలుపలికి వచ్చింది

క్రింద హాల్లో ఇద్దరు ముగ్గురు వ్యక్తులు నిల్చొని వున్నారు.

అనితని చూడగానే "నమస్కారం" అంటూ చేతులు జోడించారు.

వాళ్ళలో ఒకరి చేతిలో పేపరు వుంది.

వాళ్ళ ముఖాలలో దేన్ని గురించో తెలుసుకోవాలన్న ఆత్రం వుంది

అనితకు అర్థమయింది వాళ్ళు ఎందుకు వచ్చారో ..

మధ్య మెట్టు మీదే ఆగిపోయింది.

"మేము జర్నలిస్టులం. ." ఒకరు పరిచయం చేసుకో బోతుండగా "మీరు వచ్చిన కారణం వూహించగలను నేను మీతో ఇప్పుడేం మాట్లాడలేను. దయచేసి నన్నేం అడక్కండి." అని అనిత గిరుక్కున తిరిగి వెళ్ళి పోతుంటే "రేపు రమ్మంటారా?" అడిగాడు.

అనిత ఆగి వాళ్ళ వైపు చురుగ్గా చూసింది.

"ఏం నాగురించి మీరు తప్పనిసరిగా వ్రాయాలా?"

"వ్రాస్తే బాగుంటుందని..." ఆమె కోపాన్ని పట్టించుకోకుండా అన్నాడు.

"బాగుంటుంది. ఎవరికి ? మీకా?"

"మీరలా మాట్లాడితే నేనేం చెప్పలేను."

"మీరేం చెప్పక్కర్లేదు. మీ రాతలతో ఒక గుండెను కొయ్యకండి. ఒకరి బాధ మరొకరికి ఆనందం కాగూడదు."

"బాధ... దుఃఖం... సంతోషం... ఇవి కాదు మేము చూసేది...."

విశేషాలు చూస్తారు. నా గురించి వ్రాసే విశేషాలేమీలేవు మీరిక నాకోసం రావల్సిన అవసరం లేదు ..." వాళ్లతో మాటలు పెంచే ఓపిక లేక అన్న మాటలు మర్నాడు వాళ్ళు పని చేసే పత్రికలలో ప్రముఖంగా ప్రచురించబడి ఈనాటి వార్తకు ప్రాణం పోస్తాయని ఆమె అనుకోలేదు.

ఆవేశావేదనలు ఆమెకా ఆలోచన రానివ్వలేదు.

'ఇంకా ఎందర్నిలా ఎదుర్కోవాలో.. ' వాళ్ళు వెళ్ళాక భయం పెరిగింది

విజయ్ వచ్చాక ఆ భయం ఆవేశంగా మారింది.

అతడు తన జీవితాన్ని సుందర వనంలా చేస్తాడనుకుంది. కాని అతడు తనకు జీవితమే లేకుండా చెయ్యాలనుకున్నాడు.' అతడ్ని చూడగానే ఆవేశం పొంగింది.

'తను అతడు అనుకున్నట్లుగా నిస్సహాయురాలిలా బ్రతకడం కాదు. గర్వంగా దర్జాగా బ్రతకాలి' ఎక్కడి నుండి వచ్చిందో ధైర్యం.

'తను అతడి దగ్గరికి వెళితే ప్రాణంలేని బొమ్మలా బ్రతకడమే అవుతుంది అలాంటి బ్రతుకెందుకు బ్రతకాలి?' అతడున్నంత సేపు కలిగిన ఆలోచన్లు అతడితోనే పోయినట్లున్నాయి. ధైర్యం గూడా వాటితో పాటే పోయి బాధే మిగిలింది.

ఆ బాధ పెరిగేలా ఇరుగు పొరుగు వారి రాక...

వాళ్లందరు ఏం మాట్లాడతారో అనితకు తెలుసు. అందుకే ఎవర్నీ పైకి రానివ్వ వద్దని అనసూయమ్మకు ముందుగానే చెప్పింది.

అమ్మగారికి ఒంట్లో బాగోలేదు. పడుకున్నారు." అని వచ్చిన వారందరికి చెప్పి పంపిస్తోంది అనసూయమ్మ.

అనిత కామాటలు వినిపిస్తూనే వున్నాయి.

'కరుణ ఒక్కతే పైకి వెళ్ళి అనితను ఓదార్చింది.

ఆ పిల్లకు అనిత దగ్గర చనువు వుండడంవల్ల అనసూయమ్మ అభ్యంతరం చెప్పలేదు.

"ఆంటీ, మీరు చదువుకున్న వాళ్ళేకాదు. రచనలు కూడా చేస్తుంటారు. మీరే ఇంత నీరస పడితే ఎలా? ధైర్యంగా సమస్యను పరిష్కరించుకోవాలి." కరుణ మాటలు అనితకు కాస్త ధైర్యం కలిగించిన మాట నిజం...

'తన రచనలలో ఇలాంటి సంఘటనే వ్రాస్తే తనేం పరిష్కారం చూపించేది?' అనితకు కొద్ది సేపట్లోనే తెలిసింది అనుభవం వేరు,వ్రాయడం వేరు అని

'తను వూహలలో తేలిపోయే రచనలు చెయ్యలేదు. వాస్తవిక సంఘటనలనే కథలుగా మలుస్తుంది కాని తన సమస్యకు పరిష్కారం కనిపించడంలేదు కథ



రక్త కట్టేందుకు వాస్తవిక సంఘటనలను కొన్ని మార్పులతో వ్రాస్తుంది. కాని తన విషయం.... ఏం మార్పు చేస్తుంది? ఏమైనా తను రమేష్‌కు దూరంగా వుండాలి. బాధైనా అతడికామాట చెప్పక తప్పదు.' అనుకుంది.

*　　*　　*　　*　　*　　*

'విజయ్ ఇలా చేసి వుంటాడా?' ఆలోచిస్తూ ఇంటికి వచ్చాడు రమేష్.

'విజయ్ వ్రాయించి వుంటే తన పేరు చెప్పకుండా అతడి పేరు వ్రాయించి నలుగురు వ్రేలెత్తి చూపించేలా చేసుకుంటాడా?' అతడికి విజయ్ వ్రాయించ లేదనిపిస్తోంది.

'అతడు అనితను తీసుకెళ్లాలనుకున్నాడంటే అతడు అనితను ఎంత అభిమానిస్తున్నాడో తెలుస్తోంది. ఆమెను అవమానపరచలేడతడు. మరి ఎవరు వ్రాయించి వుంటారిది?' ఆసక్తిని అణుచుకోలేక పత్రికాఫీసుకు ఫోన్ చెయ్యాలనుకొని ఫోన్ దగ్గరికి వెళ్లాడు కాని 'తను అడిగినట్లు ఆ అజ్ఞాత వ్యక్తికి తెలిస్తే తన పేరు రేపు బైట పెడతాడేమో....'ననిపించి వెనక్కు వచ్చి కూర్చున్నాడు.

'తన పేరు తెలిస్తే హాస్పిటల్లో తనకున్న గౌరవం పోతుంది. విదేశంలో నుండి వచ్చాడని తనను అందరు గౌరవిస్తారు. తను అనితను వాళ్లకు పరిచయం చేసి వుంటే, ఈ వార్త చూసి తన నెందరు ఎన్ని ప్రశ్నలడిగేవారో... తప్పు చెయ్యకున్నా తలవంచుకోవాల్సి వచ్చేది తనీ రోజు... ఏదో ఘోరం జరగబోయి ఆగినంత సంతోషంగా వుందతడికి.

'అనిత పెండ్లి చేసుకొని గొప్పగా వుండాలనుకుంది. ఇప్పుడు తెలుసుకుంటోంది అలా వచ్చే అనర్థాలేమిటో. స్త్రీ మళ్లీ పెండ్లి చేసుకో గూడదన్న అభిప్రాయం మరింత బలపడిందిప్పు డతడికి.

*　　*　　*　　*　　*　　*

అనిత కాలేజీలో అడుగు పెట్టగానే అందరూ వింతగా చూడడం మొదలు పెట్టారు.

వారి చూపులను భరించలేక తలొంచుకొని లోపలికి వచ్చింది.

"అనితా..." ఆమెను చూడగానే ఆమె దగ్గరికి వచ్చారు ఆమె స్నేహితులు సుశీల, శోభ.

"ఏమిటి నిన్న పేపర్లో ఆ వార్త?" అడిగింది సుశీల.

"ఈరోజేం తక్కువ వ్రాశారనా? నిన్న ఒక పేపర్లో అయితే ఈరోజు మూడు నాలుగు పేపర్లలో వ్రాశారు."అంటూ అనిత వైపు చూసి "అయినా పత్రికల వాళ్ళతో అలా మాట్లాడా వేమిటి?" అంది శోభ.

"నేనేం అన్నాను? మాట్లాడ లేనని చెప్పాను." అంది అనిత.

"ఈరోజు పేపరు చూడలేదా? నువ్వు మాట్లాడినట్లు వ్రాశారే! ఇలాంటి విషయాలేవీ పత్రికలలో వ్రాయ వద్దన్నావట." అంది శోభ.

"నేనలా అనలేదే." ఆరోజుగూడా తన గురించి పత్రికలలో వ్రాస్తారను కోలేదు అనిత. అందులో నిన్నటి బాధ హృదయాన్ని గెలుకుతుంటే పేపరు చూడాలన్న ధ్యాసే రాలేదు. 'తను తెలుసుకుంటే ఇంకా బాధ పడుతుందనేమో, కరుణ చూసినా తనకు చెప్పి వుండదు.'

"ఏమన్నావో ఏమోకాని ఇలా పేపరు కెక్కే పరిస్థితి తెచ్చుకున్నావు." అంది సుశీల.

"సుశీలా, మీరా మాటలు నమ్ముతున్నారా?" సుశీల, శోభల వైపు చూసి అంది అనిత.

"మేము ఒక్కళ్ళం నమ్మడం లేదంటే సరిపోతుందా? లోకాన్ని ఒప్పించ లేము".

"మీరిలా అంటారనుకోలేదు నేను." తను తప్పు చేసినట్లే మాట్లాడుతున్న వారిని చూస్తుంటే కోపం వచ్చిందామెకు.

'తను ఆప్త మిత్రులనుకున్న వాళ్ళు సమయం దొరికితే ముందుగా వచ్చి రాళ్ళు విసిరే మనుషులు......"

క్లాసుకు వెళ్ళాలంటే భయంగా వుంది.

'అక్కడ స్టూడెంట్స్ ఏం అడుగుతారో....' భయమైనా తప్పదని అక్కడి నుండి వెళ్ళబోతుంటే ప్రిన్సిపాల్ పిలుస్తున్నారంటూ ప్యూన్ వచ్చాడు.

అనిత ప్రిన్సిపాల్ గదిలోకి వచ్చింది.

"కూర్చోండి....." అతడు మర్యాద చేసినా గొంతులో తేలిక భావం కనిపిస్తోంది.

అనిత కుర్చీలో కూర్చుంది. 'తను తప్పు చేసినట్లు భయపడుతున్నదేమిటి?'

"నిన్న స్టూడెంట్స్ ఎవరో పేపరు తెచ్చి చూపిస్తే చూశాను. మీగురించేదో వ్రాశారు. నేను దాన్ని గురించి అంతగా పట్టించుకోలేదు. కాని ఈరోజు పేపరులో మీరు ఆ వార్త నిజమే నన్నట్లుగా మాట్లాడారని వ్రాశారు."

"సర్... ...." నిర్ఘాంత పోయింది అనిత.

"నేను వాళ్ళతో ఆవిషయం గురించే మాట్లాడలేదు."

"మీరు వాళ్ళతో ఏం మాట్లాడారని నేను అడగడం లేదు. ఇలాంటి వార్తలు ప్రచారంలోకి వచ్చేలా ప్రవర్తించ గూడదు. మీరు ఎందరో జీవితాలను తీర్చిదిద్ద వలసిన వృత్తిలో వున్నారు. మీ వ్యాపకం మనుషులను సక్రమ మైన మార్గంలో నడపగల శక్తి గలది. అలాంటి మీరు..... అనితా మీకెలా చెప్పాలో తెలియడం లేదు."

అనిత మాట్లాడలేక పోతోంది.






# మీ పళ్ల మీద చిగుళ్ల పట్టు సడలనివ్వకండి!

## కేవలం ఫోర్‌హెన్స్ మాత్రమే
## చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గివున్నది.
## చిగళ్లు గట్టిగా వుంటే
## పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి.




అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్.జె. ఫోర్‌హెన్ తాను తయారుచేసిన టూత్‌పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు.

1. ఇది నేరుగా చిగుళ్ల మీద పనిచేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము.
2. చిగుళ్లను బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.
3. ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం, దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.







## ఫోర్‌హెన్స్ — ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.

339F 234



ఆమె కంఠన్ల నిండా నీళ్ళు.... ...

"మిమ్మల్ని బాధ పెడుతున్నందుకు క్షమించండి. కాలేజికి రత్నంలా ప్రకాశించిన మీరు అలాగే వుండాలని నా కోరిక. మన విద్యార్థులు మనల్ని ఆదర్శంగా తీసుకుంటారన్న విషయం మనం మరవ గూడదు. మరోసారి ఇలాంటి దేదైనావస్తే......"

అనిత కుర్చీలో నుండి లేచి బలవంతంగా ఏడుపు ఆపుకొని "వుద్యోగం నుండి తీసెయ్యమని కమిటి చెబుతుంది. ఒ. కె. సర్. చెయ్యని నేరాన్ని చేశావంటూ శిక్ష వేస్తే చేసేదేముంది?" అంటూ బైటికి వచ్చింది.

'కాలేజికి వెలుగని తనను పొగిడే ప్రిన్సిపాల్ తన నెలా మాట్లాడాడు! ఒక్క రోజులో ఎంత మార్పు......' అనితకు అనుమానం వచ్చింది.

'ఆవార్త చూసే వీళ్ళలా అనడంలేదు. రమేష్‌తో తను సన్నిహితంగా వుండడం చూస్తున్న వారికి ఈవార్త తనను తప్పు పట్టేవిధంగా చేసింది......' ఆలోచిస్తూ క్లాసు రూమ్‌లోకి వచ్చిన అనిత ఎదురుగా బోర్డు మీద బొమ్మలు చూసి అలాగే నిలబడి పోయింది.

ఇద్దరు పురుషుల మధ్య ఒక స్త్రీ. ఎడమవైపు వున్న పురుషుడి చెయ్యి పట్టుకొని, కుడివైపు వున్న పురుషుడి వైపు ప్రేమగా చూస్తోందామె.

"మళ్ళీపెండ్లి చేసుకున్నా ఆదర్శమే. కానీ పెండ్లి ండ్లేవీ నాకద్దు...." అంటూ క్రింద పెద్ద పెద్ద అక్షరాలతో వ్రాసివుంది.

లజ్జా భారంతో కుంచించుకు పోయింది అనిత.

'తన నెంత నీచంగా అనుకుంటున్నారు!' అక్కడ నిలవ లేక పోయింది. వెనక్కు తిరిగి వస్తుంటే నవ్వులు వినిపించాయి.

"మళ్ళీ పెండ్లి చేసుకున్నా ఆదర్శమే." కీచుగొంతుకతో అన్నారెవరో.

బిడ్డ తల్లిని పరిహసిస్తున్నట్టుగా అనిపించింది అనితకు.

'తను వాళ్ళ ముందుకు వెళ్ళలేదు.' స్టాఫ్‌రూమ్‌లోకి వచ్చింది.

అక్కడ ఎవరూ లేరప్పుడు.

పది నిమిషాలయ్యాక ఓలెక్చరర్ వచ్చాడు.

"మీరు క్లాసు తీసుకోలేదా?" అనితను అడిగాడు.

లేదన్నట్టు తలూపింది అనిత.

"వాళ్ళు ఒక్క రోజులోనే చాలా ఎదిగి పోయారండి: వాళ్ళ మాటలు వింటే మతి పోతుంది."

"ఈకాలం పిల్లలు అంతే. మంచిగావుంటేనే బడిపంతుళ్ళ వుద్యోగాలు కష్టంగా వుంటున్నాయి. ఇక ఏకాస్త సందు దొరికినా మనల్ని లెక్క చేస్తారా?" కాగితాలేవో చూస్తూ అన్నాడు

" నేనేం తప్పు చెయ్యలేదండి." కష్టంమీద గొంతుపెగుల్చుకొని అంది అనిత.

"నేను మీగురించి మాట్లాడడం లేదండి. మామూలుగా జరిగే విషయం చెబుతున్నాను..." అంటూ ఆ విషయం మాట్లాడడం ఇష్టం లేదన్నట్టు అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

'మామూలుగా జరిగేది.... ఏమిటి? ఎక్కడో ఏదో చదివి ఒకర్ని అవమానిస్తుంటే చూస్తూ కూర్చోడమా...... తనీ మాటలు చేతలు భరించలేదు. తన తృప్తి కోసం తను వుద్యోగం చేస్తోంది. అది బాధకు హేతువౌతుంటే ఎందుకు చెయ్యడం?' గబుక్కున టేబుల్ మీదే వున్న పుస్తకంలో పేపరు తీసుకొని రాజీనామా ఇస్తున్నట్టుగా లెటర్ వ్రాసి ప్రిన్సిపాల్ టేబుల్ మీదపెట్టి ఇంటికి వచ్చింది.

* * * * *

"ఆంటీ, మీరు వుద్యోగానికి రిజైన్ చెయ్యకుండా వుండాల్సింది. దీని వల్ల కొందరు నిందను నిజమనుకోవచ్చు

అనిత రిజైన్ చేసిన విషయం గూడాపేపరులో రావడం చూసి అంది కరుణ.

"అనుకున్నా పరవాలేదు. వాళ్ళ మాటలు వినలేనమ్మా." అంది అనిత.

"కొన్నాళ్ళు సెలవు పెట్టి వుంటే బాగుండేది."

"అప్పుడు నన్ను వాళ్ళు అర్థం చేసుకుంటారంటావా? ఏది చేసినా ఫలితం ఒక్కటే. అవమానం జరిగిన చోటికి వెళ్ళను."

"కానీ ఆంటీ, ఇది ఒక్కరోజుతోపోయేదికాదు. మీ నిర్ణయం భవిష్యత్తు మీద గూడా ప్రభావం చూపిస్తుంది."

"నేను భవిష్యత్తు గురించి ఆలోచించలేదమ్మా. ప్రస్తుతం ఎలానిలవగలనని ఆలోచించాను. తోచింది చేశాను."

"మీరు కాలేజి వరకే ఆలోచించారు. కాని మీరామాటలను బైటి ప్రపంచంలో గూడా ఎదుర్కోవలసి వస్తుంది. మీరు పేరున్నవారు. మామూలు మనుషులైతే ఇవేవీ పేపర్లో వ్రాసేవారుకాదు. వ్రాసినా అనుకొనే వారుండరు."

"నా దురదృష్టమమ్మా. అనుకోకుండా పేరు వచ్చింది."

"ఛ ఛ, ఎందుకలా అనుకుంటారు ఆంటీ. అందరికీ అందే వరమా అది? మీరు ధైర్యంగా వుంటే ఆ పేరు అలాగే వుండడంకాదు, మరింత ప్రతిష్ఠ సంతరించుకుంటుంది."

కరుణ మాటలతో తెచ్చుకున్న ధైర్యమంతా తర్వాత వచ్చే మనుషులను చూడగానే కోల్పోతోంది అనిత.

వుద్యోగానికి రిజైన్ చేసిందని తెలియడంతో వచ్చేవారి సంఖ్య పెరిగింది.

బంధు మిత్రులు.... అభిమానులు.... మహిళా సమాజాల వాళ్ళు..... విషయమేమిటో ఆమె ద్వారానే తెలుసుకోవాలన్న కుతూహలంతో వస్తున్నారు.

తప్పించుకుందామన్నా వీలుకావడంలేదు అనితకు.

భోజనం చేసి పైకి వెళుతున్న సమయంలో వచ్చేవారు కొందరు.

వాళ్ళతో మాట్లాడుతున్న సమయంలోనే మరొకరు రావడం.......

మాట్లాడకుండా వెళ్ళిపోతే ఇంకేం కథలు అల్లుతారోనని భయం.

తను క్రిందికి రాగూడదనుకున్నా ఆ భయమే ఆమెను లాక్కొస్తోంది.

"ఎందుకిలా వ్రాశారు?" అంటూ అడిగే వారికి " ఎందుకు వ్రాశారో నాకు తెలియదు." అని చెబుతోంది.

"మీరలా వ్రాసే అవకాశం ఎందుకిచ్చారు?" అంటే "ఆలోచన లేక పోవడం వల్ల." అంటోంది.

"రమేష్ బంధువే. కాని భర్తకు దూరమైన తను అతడితో సన్నిహితంగా వుండడం..... అనుమానం కలిగిస్తుందెవరికైనా. తన కప్పుడు ఆ ఆలోచన రాలేదు.' బాధగా అనుకుంది.

అనిత వచ్చి అడిగిన వాళ్ళ మాటలతో నీరసించి పోతుంటే ఉత్తరాలు లేవకుండా చేస్తున్నాయి.

ఒక ప్రముఖ మాస పత్రిక పాఠకుల ప్రశ్నలకు సమాధానం ఇచ్చేందుకు ఒప్పుకుంది కొద్ది రోజుల క్రిందట.

వాటికి వచ్చే ఉత్తరాల సంఖ్య గతం కన్నా బాగా పెరిగిందిప్పుడు. అవన్నీ ఆమెకు సంబంధించిన ప్రశ్నలే.

"సంఘానికి హితవు చెప్పాల్సిన మీరే ఇలా ప్రవర్తించడమా....." అంటూ ఎదుట నిలేసి అడిగేవారి కంటే వ్రాసేవారి మాటలు కఠినంగా వుంటున్నాయి.

"ఆడది మళ్ళీ మళ్ళీ పెండ్లి చేసుకోడం అనే హక్కు కంటే మరేం కోరదా? అంతకంటే కోరదగిన వేవీ లేవా?" ఘాటుగా వ్రాస్తున్నారు కొందరు.

"మీరు వ్రాతల్లో తప్ప చేతల్లో 'మంచి'ని చూపించ లేరా? స్త్రీజాతే సిగ్గుపడేలాచేస్తున్నారెందుకు?" కొందరి కోప పూరిత మైన ప్రశ్న.

"ఎదుటి వారికి చెప్పేటందుకే నీతులు వున్నాయి. అది మీ విషయంలో నిజమేగదూ?" వ్యంగ్య ధోరణిలో అడిగిన వారు కొందరు....

'తనను రచయిత్రిగా మంచి లెక్చరర్‌గా గుర్తించేందుకు చాలాకాలం పట్టింది మనుషులకు. కాని దారి తప్పిందన్న వార్త వచ్చీ రాగానే ఎందరు తెలుసుకున్నారు!' ముందు పెట్టుకున్న ఉత్తరాల నన్నిటినీ చేతో దూరం నెట్టి పిచ్చిగా నవ్వుకుంది.

'వీటికి తను సమాధానం ఇవ్వాలా?'







మరో వారం గడిచినా వచ్చే ఉత్తరాలలో ఆమె వ్యక్తిగత జీవితం గురించిన ప్రశ్నలే వుంటున్నాయి.

'వీటికి తను జవాబు చెప్పాల్సిన అవసరం లేదు. తన గురించి చెప్పుకొనేందుకు కాదా శీర్షిక....' ఆ మాటే పత్రికకు వ్రాసింది.

తప్పు చెయ్యడం వల్లే ఆమె అలా చెప్పి తప్పించుకుందనుకున్నారందరు.

ఆ మ్యాగజైన్‌కు సమాధానా లివ్వనన్నదన్న విషయం గూడా పేపర్లో వచ్చింది.

* * * * *

"అనితాదేవి ఎందుకిలా చేసిందో! వుద్యోగానికి రిజైన్ చెయ్యడం ... పత్రికల వాళ్ళకలా చెప్పడం. ..నేరాన్ని ఒప్పుకున్నట్టుగా వుంది." బాధగా అన్నాడు భార్గవ.

"అనిత పైకి కనిపించేంత ధైర్యస్తురాలు కాదు. ఎంత బాధలో వుండి అలా చేసిందో! అందుకే భార్గవా, నేను మీ దగ్గరికి వచ్చానిప్పుడు. మీరు నాకో సహాయం చెయ్యాలి." అన్నాడు విజయ్.

"చెప్పు. ఏం చెయ్యాలి? ఏం చేసినా నీ రుణం తీర్చుకోలేమురా." అన్నాడు సుధాకర్.

విజయ్ కోపంగా చూశాడు.

"రుణాల ప్రసక్తే అయితే మీరేం చెయ్యక్కర్లేదు."

"అబ్బ, నోరు జారి అన్నాను లేరా. పొరపాటయింది. మనలో మనకు రుణా లేమిటి? మాకు నువ్వు....నీకు మేము... మనం ఒకరి కొకరం సహాయం చేసుకోడం రుణం ఎలా అవుతుంది? నీ బాధ తగ్గితే మా బాధ తగ్గుతుంది. ఇందులో మా స్వార్థం కనిపించడం లేదూ!"

"ఊఁ." నవ్వాడు విజయ్.

"మీరు అనితను చక్రపురంలో వుండేలా చెయ్యాలి..." అనిత గురించి వచ్చే వార్తలు వినలేకపోతున్నాడతడు. ఆమె బాధ పడుతోందని తను బాధపడడం తప్ప ఏం చెయ్యలేకపోతున్నాననుకుంటున్న అతడికి సాయంత్రం ఇంటికి వస్తుండగా ఆలోచన వచ్చింది అనితను చక్రపురం పంపించాలని.

సుధాకర్ నాలుగు రోజులలో అక్కడికి వెళుతున్నాడు.

"అనిత ఇక్కడే వుంటే మానసికంగా క్షోభించక తప్పదు. వాతావరణం మారాలి. అక్కడైతే ఆమె సుఖంగా వుంటుందనిపిస్తోంది నాకు." అన్నాడు విజయ్.

మొదటిసారి సుధాకర్, భార్గవ క్యాంపుకు వెళ్ళినప్పుడు విజయ్, అనిత గూడా వెళ్ళారు చక్రపురానికి.

అప్పుడు అక్కడివాళ్ళు అనిత మీద చూపించిన అభిమానాన్ని మరవలేదు విజయ్.

"చిన్ననాడెప్పుడో చూసిన ఈ పల్లె మీద ఎందుకు తల్లీ ఇంత మమకారం?" అంటూ ప్రేమగా పలకరించారు పెద్దలు.

"ఈ పల్లె మీద కాదు. మీమీదే మమకారం. మీరూ అందరిలా వుండాలని నా ప్రయత్నం. మీలో మార్పు రావాలి అప్పుడు ఎక్కడి నుండో డాక్టర్లు రావడం కాదు. మీరే హాస్పిటల్‌కు డాక్టర్లు వచ్చేలా చెయ్యగలుగుతారు. స్కూలు వస్తుంది మీ పిల్లలు వృద్ధిలోకి వస్తారు..." వారికెన్నో విషయాలు చెప్పింది అనిత.

"అనితా ఈ ఊర్లో నీ ప్రక్కన నిలవలేను నేను." అన్నాడు విజయ్ పొలం గట్టు మీద నడుస్తూ.

"ఏం, మిమ్మల్ని ఎవరూ పలకరించడం లేదనా?" నవ్వింది అనిత.

"కాదు. నీకు నేను తగనన్నట్టుగా చూస్తున్నారు వాళ్ళు." మూతి ముడిచాడు. (బుంగమూతి పెట్టాడు.)

"అదేంకాదు. ఇంతటి వారితో ఏం మాట్లాడగలమన్నట్టు చూస్తున్నారు."

"నిజంగా..."

"మీ సూటు బూటు చూసి అలా అనుకుంటున్నారు మీ మనసు తెలిస్తే ఇంకేం అనుకుంటారో .."

"ఏం అనుకుంటారు?" అల్లరిగా అడిగాడు.

"దేవుడే దిగి వచ్చాడని...." అతడి వైపు ఆరాధనగా చూస్తూ అంది అనిత

"అమ్మో, వరాలు అడుగుతారేమో ఏం చెప్పకు." నవ్విన అతడితో పాటు అనిత గూడా నవ్వింది

'ఆనాటి ప్రేమ, ఆదరణ ఏమయ్యాయో...తన కలలన్నీ కుప్పలా కూల్చి పోయింది అనిత....' గతాన్ని తొంగి చూసిన విజయ్ మనసు అతడి ముఖం మీద విచార రేఖలను పరిచింది.

"విజయ్..." అతడి పరిసితి అర్థం చేసుకున్న వాడిలా అతడి భుజం మీద చెయ్యి వేశాడు సుధాకర్.

"బాధపడి చేసేదేం లేదు ఏదైనా ఎప్పటికప్పుడు మరిచిపోతేనే మనిషికి సఖ్యం. నువ్వేం దిగులు పడకు. అనితగారికే బాధా లేకుండా మేము చూస్తాముగా."

విజయ్ అతడికి కనిపించకుండా ముఖం ప్రక్కకు తిప్పుకొని కర్చీఫ్‌తో కండ్లు తుడుచుకొని లేచి "వెళ్ళొస్తా" నంటూ బైటికి వచ్చాడు.

(ఇంకా ఉంది)




### కె. రామగుండం.

నన్ను కార్డియాలజిస్టులు పరీక్షించి పల్మోనరి స్టినోసిస్ అనే హార్టుకంప్లైంట్ ఉందన్నారు నా వయస్సు 30 సం లు ఆపరేషన్ చేసిన 4,5 సం.లకి మళ్ళీ ఆపరేషన్ చెయ్యవలసి ఉంటుందా? ఉంటే అలా ఎన్ని సార్లు చెయ్యాలి. పల్మోనరీ స్టినోసిస్ అంటే ఏమిటి?

★ ఆపరేషన్ విజయవంతంగా జరిగిన తర్వాత మరలా చేయవలసిన అవసరం ఉండదు. హృదయం నుంచి ఊపిరితిత్తులకి చెడు రక్తాన్ని తీసుకు వెళ్ళే పల్మోనరీ ఆర్టరీ మొదలయ్యే భాగంలో ఉన్న కవాటంలోని ద్వారం మామూలుకన్నా మూసుకు పోయి ఉండటాన్ని పల్మోనరీ స్టినోసిస్ అని అంటారు.

### బి. జె. ఆర్. ఆర్ – -పెనుమాక

లాప్రోస్కోపిక్ ఆపరేషన్ అయిన నెలలోపు సంపర్కం వల్ల సంతానంకలిగే అవకాశం ఉందా? అయితే ఆ స్త్రీకి ప్రమాదం కలుగుతుందా?

★ ఆపరేషన్ అయిన నెల తర్వాత జరిగిన సంపర్కం వల్ల పిల్లలు పుట్టే అవకాశంలేదు. అందు వల్ల ప్రమాదం అనేదానికి ఆస్కారం లేదు

### వి. ఎన్. – -తిరుపతి

నావయస్సు 29 సం లు. నాకు 11.12 82న హార్ట్ ఆపరేషన్ జరిగింది. మైట్రల్ స్టినోసిస్ ఓపన్ చేశారు. అది మొదలు ఏ విధమైన అనారోగ్యమూలేదు కాని 15 రోజులుగా యూరిన్ పాస్ చేసేటప్పుడు మంటగాఉన్నది. దీని వలన ప్రమాదమా. మందులు వాడితే కొద్దిగా ఉపశమనంగా ఉన్నది

★ రెండు సం.ల క్రితం జరిగిన మైట్రల్ స్టినోస్ ఆపరేషన్‌కీ ప్రస్తుతం మూత్ర విసర్జన సమయంలో మంటకీ సంబంధం లేదు. మూత్రపరిశోధన చాలా అవసరం. మూత్రంలో సూక్ష్మ క్రిములున్నదీ లేనిదీ పరీక్ష చేయించుకోవలసి ఉంది అధికంగా నీరు త్రాగటం, మూత్రపరీక్ష అనంతరం తగిన మందులు వాడటం వల్ల ఈ లక్షణం త్వరగా తగ్గి పోతుంది

### ఎన్. ఎస్. బి. అమలాపురం

నేను సున్తీ చేయించుకొని 6 నెలలు అయినది దానితరువాత అంగము చుట్టూ రెండు పొక్కులులాగ వచ్చినవి ఇప్పుడు నాలుగు పొక్కులు వచ్చి పెద్దవిగా అయినవి

★ సున్తీ చేయించుకున్నందు వల్ల పొక్కులు రావటం, అవి అధికం అవటం జరుగదు. సూక్ష్మ క్రిముల ప్రవేశమే దీనికి కారణం. వైద్యులకి ఈ పుండ్లను చూపించి రోగ నిర్ధారణ అయిన తర్వాత వారి సలహా మేరకి చికిత్స చేయించుకోవలసి ఉంటుంది సుఖరోగం కాదని నిర్ధారణగా తెలుసుకోవలసి ఉంది.

### పి. పి. ఆర్. - విశాఖపట్నం

నావయస్సు 22 సంవత్సరములు ఆరోగ్యవంతుని హృదయ స్పందన నిముషమునకు 72 సార్లు కదా! కాని నా హృదయము 56 సార్లు మాత్రమే కొట్టుకొనుచున్నది. కారణం ఏమిటి? నాకు ఎటువంటి అనారోగ్యము లేదు

★ ఇలా తక్కువసార్లు కొట్టుకోవటం కొందరిలో సహజమే! దీనికి ఏ రోగము కారణం కాదు □




అంతబలమైన రైలుబండీ అతి సాధారణమైన పట్టాల మీద నిబ్బరంగా పరుగెడుతోంది తన విధి నిర్వహణలో లగ్నమై.

ఆ రైలుబండిలో రకరకాల మంది ప్రయాణం. అందులో రామారావు పిల్లల్తో, భార్య తేజోవతి, తల్లి నాగమ్మతో స్వంత ఊరొస్తున్నాడు చూసిపోవడానికి.

రామారావుకి విజయనగరంలో చిన్ని ఉద్యోగం. ఉద్యోగం పురుషలక్షణం అంటూండేవారు తెలుగు మాష్టారు పరమశివంగారు ఆయన ఈ లోకంతో గల సంబంధాల సంకెళ్లను తెంచుకుపోయారు. ఆయన బోధించిన పాఠాలు రామారావు రక్తం నిండా కలిసిపోయాయి

ప్రయాణం మధ్యలో ఓ యువకుడు రామారావున్న కంపార్టుమెంట్లో కొచ్చిపడ్డాడు రైలు ప్రయాణం కొత్తగామోసు, సామానులతో తిరకాసు పడుతున్నాడు. చూస్తుంటే చాదస్తం అతణ్ని తరుముకొస్తున్నట్టుంది. జీవన్‌టోన్ ఎడ్వర్‌టైజ్‌మెంట్‌కి పనికిరాడు సరికదా అతణ్ని ఏ టానిక్కు కంపెనీ కనుచూపు మేరల్లోకి రానీయదు

రామారావే కలుపుగోలు తనంగా రెండుమూడుసార్లు మాట్లాడాడు ఆ యువకునితో. ఆ యువకుడు మాత్రం అంటీ అంటనట్టు మాట్లాడి ఊరుకున్నాడు. మధ్య మధ్య బీడీల్తో కుస్తీ పట్టులు కూడా ప్రారంభించాడు.

రైలు నరసాపురం చేరుకుంది; చీకటి వెలుగుల శాలువా దులుపుకుంది ఉషః కాంతిలో. శరీరం పరుచుకుని.

రామారావు తల్లీ పిల్లలూ భార్యా రైలు దిగేశారు. సామానుతో ఆ యువకుడు దిగలేక కంపార్టుమెంటుని బాధపెట్టేస్తుంటే,

"పాపం మీరేం బాధపడతారు, నేను సహాయం చేస్తాను" అంటూ రామారావు సహాయం చేయబోతే అతనికి భార్య తేజోవతి ఓ చెయ్యి అందించింది ధర్మపత్ని కనుక.

తమ తోవను తాము పోకుండా యిలా పరాయివాళ్ల బరువుకూడా తమ శిరస్సున ధరిస్తారా అనుకున్నాడు ఆ యువకుడు. అటువంటి మంచివాళ్లనెప్పుడూ చూడలేదు కనుక.

దించిన సామాను రైల్వే గేటువరకూ తెచ్చుకోబోయి మళ్లీ అవస్థపడుతుంటే అప్పుడు కూడా కొంత సామాను రామారావు తీసుకుని గేటు బయట వరకూ తెచ్చిపెట్టాడు.

రామారావు ఇద్దరు రిక్షా కార్మికులకు పనిపెట్టాడు. ఒక రిక్షాలో తన భార్యనూ తల్లినీ కూర్చోబెట్టాడు ఉన్న కొంచెం లగేజీ అందులో వేసి. తక్కినదాంట్లో పిల్లలిద్దర్తో కూర్చున్నాడు. అయినా రిక్షా గర్భాన ఖాళీ ఉంది.

"బస్టాండు వరకూ వెళ్తాం. మీరు కూడా రండి" ఆహ్వానించాడు రామారావు ఆ యువకుణ్ణి

"అబ్బే యెందుకులెండి. నెమ్మదిగా నడిచేస్తాను. యిదేగా మా ఊరు. "కొమ్మల్లో దాగిన పక్షిలా ప్రాణభయంతో అన్నట్టున్నాయి అతని మాటలు.

"మాకు కంపెనీ గా బసెక్కుతారేమోనను-కుంటున్నానండి"

అప్పుడే స్నేహజ్యోతి వెలిగించేసుకుంటున్నారు.- శ్రీవారు అనుకుంది భర్త గుండె లో తులెరిగిన తేజో-వతి.

"మీ యింటికి దగ్గర తోవ యెటో చెప్పండి. అలా రిక్షా తీసుకెళ్లి మిమ్మల్ని మీ యింటికి దగ్గర్లో వదలి మేం తిన్నగా బస్టాండుకి వెళ్తాం" అన్నాడు రామారావు. అతనిలో దివ్యమైన ప్రేమజ్యోతి దర్శించే తీవ్ర ప్రయత్నంలో.

యువకుడు మరీ రాను కాదు కనుక రామారావు ఆహ్వానానికి వికసించేడు రిక్షా యెక్కాడు. మాటా మంచీ ఊపిరి పోసుకున్నాయి.

ఆ యువకుని పేరు విశ్వేశ్వర్రావు.

లోకల్ హైస్కూల్లో వెలుగులు పంచే తెలుగు పంతులు.

రామారావుకి తెలుగు మాష్టార్లంటే అభిమానం. ప్రేమ. భక్తి.

రిక్షా దిగిపోయి వెళ్లిపోబోయి తటపటాయిం-చాడు. సంస్కారమంటే తెలియదనుకుంటాడని కాబోలు "మీరెప్పుడయినా మా యింటికి రండి. యిక్కడికి వో వంద అడుగుల దూరంలో ఆ వీధి మలుపులో ఉంటున్నా" అన్నాడు విశ్వేశ్వర్రావు ఇక తప్పక.

అతను కేవలం మర్యాద ముసుగులో దూరి. పెద్దాల్ని ఆడించాడు తప్ప అంత విశాలమైన గుండె వుంటే అది తనకే భారం తన కొంప నిజంగా ఓ పెద్ద రొంపు. అనేక పట్నంపుల ఉక్కి పిడికిల్ల మధ్య మరో పాషాణం తాను.

భార్య వో పెద్ద ముళ్లకంప. అంతకంటే ఇనప-ముళ్లకంచె తాను. విశ్వేశ్వర్రావు తల్లి వుంది. బతికే ఉంది. ఆమె యింకా బతికున్నందు విశ్వేశ్వర్రావుకి బయటకు చెప్పలేనంత మంట.

రామారావు తన తల్లి గురించి చెబుతూ "మా నాన్నగారు కాలం చేసినప్పట్నుంచీ మా అమ్మగారిని నా దగ్గరే ఉంచు కుంటున్నాను. ఆ మధ్య పక్షవాతం వచ్చింది. రాత్రింబవళ్ళు నేను చేయగలిగిన ఉపచారాలన్నీ చేశాను. ఆ దేవుడు ఉన్నాడు సుమండీ. మా అమ్మ కొంచెం కోలుకుంది. ఈ లోకంలో మనక్కావలసిందేముంది తల్లి ఆశీర్వాదం తప్ప. ఆమే కదా కళ్లెదుట కనిపించే దేవత."

విశ్వేశ్వర్రావుకి ఆ మాటలు తేనె టీగల తుట్టగా ఉన్నాయి. రామారావు "వెళ్లొస్తా మాస్టారూ" అంటూ నమస్కరించాడు. సంస్కారమూ, ఆత్మీయతా-గ్రీష్మంలో వర్షంలా ఉన్నాయి.

విశ్వేశ్వర్రావు రక్తంలో జెర్రులూ, తేళ్ళూ పాకాయి.

నెల రోజులు రాకెట్ స్పీడ్‌లో వెళ్లాయి. రామారావుకి మళ్లీ తిరుగు ప్రయాణం దగ్గర్లో ఉంది. స్టేషన్‌కి రిజర్వేషన్‌కని వెళ్లాడు రిజర్వేషన్ కౌంటర్లో పనయ్యాక తరువాత తిరిగి వస్తుంటే విశ్వేశ్వర్రావు మాష్టారు బొమ్మ బ్రెయిన్ మీద కొచ్చింది. అంత పెందలాడే వెళ్లినా బస్సుకోసం రెండు గంటల కాలాన్ని ఖూనీ చెయ్యాలి. కనుక ఓసారి విశ్వేశ్వర్రావు మాష్టార్ని కలుసుకొని, అతని స్నేహంలో గల గొప్పతనం చవిచూడాలనీ, అదో అపురూపమైన స్మృతిగా దాచుకోవాలనీ బయలు-దేరాడు.

సగం దూరం నడిచిన తర్వాత ' విశ్వేశ్వర్రావు మాష్టారు యిల్లెక్కడండీ?' అనడిగాడు ఒకతణ్ణి.

"అంటే అప్పట్లో పరమశివం పంతులుగారుండే-వారు. వారబ్బాయేనాండి?"

ఏమిటి! విశ్వేశ్వర్రావు తన గురుదేవులైన పరమశివం మాష్టారు గారబ్బాయా? మరికొన్ని ప్రశ్నల పిదప విశ్వేశ్వర్రావు పరమశివం మాష్టారు గారబ్బాయే నని రూఢయ్యింది.

శిలలాటి తనను మనిషిగా మలిచిన మహాబ్రహ్మ ఆయన.

అంతటి మహానుభావుని జీన్స్ నుండి పండిన కొమరుడు విశ్వేశ్వర్రావు.

పరమశివం మాష్టారు అనేక విద్యార్థుల హృదయక వాటాలు తెరచి అందులో విజ్ఞాన దేవతను ప్రతిష్ఠించి ఆత్మను తేజోమయం చేసిన గొప్ప మనీషి. స్వయంగా ఆచరిస్తూ, తమ విద్యా-ర్థుల చేత ఆచరింపజేసే అసాధారణ వ్యక్తి. రామారావుకి హృదయంలో దాగిన గురుభక్తి భూదేవిని బద్దలగొట్టు కొచ్చిన జలవాహినిలా మారింది. తనువు పులకరించి పోయింది. ఆయన దర్శనభాగ్యం యిక కలగదు. కనీసం ఆయన సుపుత్రుని మరోసారి దర్శించి తన గురుభక్తిని వెల్లడించుకునే అవకాశం కలిగినందుకు జీవితం ధన్యమయ్యింది కదా ననుకున్నాడు.

ఆ వ్యక్తి "యిదేనండి పరమశివం పంతులు-గారబ్బాయి యిల్లువాళ్ల ఊళ్లో యిల్లు అమ్మేసి యిక్కడ అద్దె యింట్లో ఉంటున్నారు. పంతులు-గారబ్బా యున్నాడే, చాలా ఘటికుడు లెండి" అన్నాడు వ్యంగ్యంగా.

రామారావుకేం చెప్పాలో తెలీక కృతజ్ఞతలు చెప్పి ముందుకి నడిచాడు.

రామారావు మెట్లెక్కాడు. ఆనందబాష్పాలు పొర్లుకొస్తున్నాయి. దగ్గరగా మూసివున్న తలుపు దగ్గరకెళ్లి "మాష్టారూ!" అని పిలుద్దా మనుకున్న వాడల్లా లోన యేదో గొడవ విని గుండెల్లోంచి తూటా దూసుకెళ్లిన వాడిమల్లే నిలబడిపోయాడు.

"కన్న తల్లినైన నన్నిలా చిత్రహింసలు పెడ్తున్న నీకు భావ్యం కాదురా బాబూ" ఆక్రోశిస్తున్న ఒ ముసలి కరం.

# కలిసి మెలసి బ్రతుకుదాం

కలిసి పాడు తమ్ముడూ
అపస్వరం భయముండదు
కలిసి చదువు తమ్ముడూ
అపశబ్దం భయముండదు
కలిసి ఆడు తమ్ముడూ
అపజయాల భయముండదు
కలిసి నడువు తమ్ముడూ
అపహారం భయముండదు
కలిసి బ్రతుకు తమ్ముడూ
అపయానం భయముండదు

* *

చూడ నొక్క చుక్క కన్న
చుక్కల గమి అందంరా
చూడ నొక్క పూవు కన్న
పూల గుత్తి అందంరా
చూడ నొక్క మబ్బు కన్న
మబ్బుల పరి అందంరా
చూడనొక్క గువ్వ కన్న
గువ్వల పిండందంరా
చూడ నొక్క జింక కన్న
జింకల దాటందంరా
చూడ నొక్క దివ్వె కన్న
దివ్వెల బారందంరా

*

కలయికలో శక్తి ఉంది
కౌగిలిలో రక్తి ఉంది
ఏకతలో శక్తి ఉంది
ప్రీతి లోన రక్తి ఉంది
అందుకనే అక్షరాల
బంధంలో శక్తి ఉంది
అందుకనే సప్త స్వర
మేళంలో రక్తి ఉంది
అందుకనే అందరము
అనురాగం పంచి పంచి
కుల మతాల విస్మరించి
కలిసి మెలసి బ్రతుకుదాం

—కనమలూరు వెంకట శివయ్య

# ఇవేమన పద్యాలు




తనకు లేమినాడు దైవము దూరును
తనకు కల్గినేని దైవమేల
తనకు దైవమునకు తగులాటమా కొంత
విశ్వదాభిరామ వినురవేమ.

## ఇది కర్మ భూమి

"యీ వెధవ కబుర్లు కట్టిపెట్టు అంటూ పెళ సరిగా విరుచుకు పడుతోంది ఓ వయస్సులో ఉన్న స్త్రీ కంఠం.

మాటలు బ్రహ్మాదండ ముళ్ళులా సూటిగా ఉన్నాయి.

అగ్ని తనను చుట్టుకుంటున్నట్టు బాధపడ్డాడు

సభ్యత నటుపెట్టి తలుపు గెంటాడు.

పెరటివేపున నిలబడ్డ విశ్వేశ్వర్రావు స్పష్టంగా తనకు కనబడుతున్నాడు బుసలుకొడుతూ.

"మీ నాన్నగారి కొచ్చే పెన్షన్ డబ్బు కూడా తెచ్చి నీ చేతిలోనే పోస్తున్న నన్ను వేరే వండుకోమంటే నేనెలా బతకను బాబూ!" అర్థిస్తోంది ముసలావిడ గుండెను గుప్పెట్లో పెట్టుకొని

"లేకపోతే ఎవడికిద్దామనే?" అంటూ సభ్య ప్రపంచానికే అవమానకరమ్మైన బూతులు వాడుతోంది వయసులో ఉన్నామె. చూస్తుంటే విశ్వేశ్వర్రావు భార్యలా ఉంది

"నన్నూ, నా పెళ్లాన్నీ ఎదురిస్తావా– ముసలిదానా, ఎవడు పోషిస్తాడే నిన్ను" అంటూ మీదకెళ్లి జుట్టు పట్టుకు గుంజి వెనక్కి గెంటాడు.

"ఆ మహానుభావుడు వెళ్లిపోయినప్పట్నుంచీ నేనే నరకంలో పడ్డాను పరమశివం పంతులు పెళ్లాం అంట్లు తోముకుంటూ పొట్ట పోసుకుంటుంటుంటే స్వర్గంలో ఉన్న ఆయనెంత విలపిస్తున్నారోగాని ఆయన కొడుకువైన నీకు మాత్రం వీసమంత సిగ్గయినా లేకుండా పోయిందేమి నాయినా" అంటూ ఆత్మాభిమానం గుర్తుచేస్తూ, అసహాయంగా రోదిస్తోంది వృద్ధమూర్తి.

రామారావు గురుదేవోభవ అనుకుని పూజ్యభావంతో కళ్ళు మూసుకొని పరమశివం పంతులుగారిని తన మనసులోనే దర్శించుకున్నాడు.

పరమశివం పంతులుగారు వయోవృద్ధులైన తనతల్లి దండ్రులకు తాను పెన్షన్ మీద వెళ్లే వయసులో కూడా సేవలు చేశారు. పక్కమీదే కాలకృత్యాలు జరిగిపోయినా ఆయనే అవన్నీ కడిగి, ఉతికి, శుభ్రంచేసేవారు "తల్లిదండ్రులే ప్రత్యక్షదైవాలని తన స్వీయ జీవితం అద్దపుడూ చెబుతూంటే రామారావుతో పాటు అనేకమంది తమ భావి జీవితాల్లో తల్లిదండ్రుల్నెలా పూజించాలో ఆయన్ని ఆదర్శంగా తీసుకున్నారు.

కాని ఆయన కుమారుడు మాత్రం ఆయన ముద్రించినవి కాళ్లరాసి పారేస్తున్నాడు కన్నతల్లిపై భార్య చెప్పే చాడీలు నమ్ముతూ, గయ్యాళి భార్యను వెనకేసుకొచ్చి ఏ నేరమూ లేని తల్లి నెందుకలా హింసించాలి.

అక్కడ జరిగిందేమిటో తనకు పూర్తిగా అవగాహనయ్యింది. ప్రత్యక్షంగా చూశాడు. అందుకే నలుగురూ పరమశివం మాష్టారు కొడుకుని తిడుతున్నట్టు తెలిసిపోయింది.

ఆ పాడు వాతావరణంలో నిలబడలేక వెనక్కి తిరిగాడు రామారావు. కాని కాళ్ళు ముందుకి సాగడం లేదు.

రామారావు కళ్ల ముందు పరమశివం మాష్టారు మెరుపులా నిలబడినట్టుంది. ఆయన బోధించడమే కాదు. ఆచరించిన మహాయోగి.

నిజమ్మైన శిష్యుడిగా, ఒక మనిషిగా తన కర్తవ్యంయేమిటి? రామారావు మనసులోనే తన గురుదేవులకు ప్రణమిల్లాడు అతనిలో కొత్త శక్తి ప్రవేశించింది.

అతను గాంభీర్యంగా లోనకెళ్లాడు.

"విశ్వేశ్వర్రావుగారూ!, ఇక్కడ జరిగింది కళ్లారా చూశాను. చెవులారా విన్నాను. కాని మిమ్మల్ని నిందించడానికి రాలేదు నేను. పరమశివం మాష్టారు నా గురుదేవులు. వారి భార్య నాకు మాతృసమానులు. మీ కభ్యంతరం లేకపోతే ఆమెను నా తల్లిగా నాతో తీసుకెళ్లి, ఓ కొడుకుగా నా ధర్మం, నా కర్తవ్యం నిర్వర్తిస్తాను. దయచేసి కాదనకండి" అని ప్రాధేయ పూర్వకంగా అడిగాడు రామారావు ముకుళిత హస్తాలతో. □


నవ్వులపువ్వుల
మహాసభ!
కుమారి రాగతిపండరి


ఎంత ప్రపంచ హాస్య మహాసభలకి వెళ్తే మాత్రం
పొట్ట చెక్కలై పేలంగ
నవ్వాలనుకున్నా?!


ప్రపంచ హాస్య మహాసభలకి
వెళ్ళొచ్చిన దగ్గరనుంచీ అలా
తయా తయా రాడినా!


ఏరేం లేదు.... ఈమధ్య హాస్య సభలకి
వెళ్ళొచ్చాడులే!


ఆయన ప్రఖ్యాత హాస్యశ్రీ!
అందరికీ చక్కిలిగింతలు పెట్టి
నవ్వించే ప్రక్రియను అభ్యసించారు!!
హ్యూమర్
కాన్ఫరెన్స


ఏమిటో డాక్టర్ గారూ.... మొన్న
హ్యూమర్ కాన్ఫరెన్స్‌కి
వెళ్ళొచ్చారు అంతే అదే వరస!
హ్హ హ్హ హ్హ హ్హ


ఏంటలా హడలిఛస్తారూ....
హాస్య సభకి వెళ్ళి
కడుపుబ్బా నవ్వా!


ఆఁ... నవ్వు నాలుగు విధాల చేటు
అంటారు కదాని నేనే అలా
అంటుంటే మరి పంపించా
ఆయన్ని హాస్య సభకి!




(గత సంచిక తరువాయి)

రాష్ట్ర కూటులు నిర్మించిన కైలాసా దేవాలయం చూపరులను దిగ్భ్రములను చేస్తోంది. ఆ యెత్తైనా గుడి ఒక పర్వతం నుండీ తొలిచారంటే నమ్మశక్యంగా లేదు. కానీ యిది చరిత్ర సాటి చెప్తున్న సత్యం

పైకెక్కి దేవాలయంలోకి ప్రవేశించారు.

అక్కడ కొబ్బరికాయలు కొట్టడం నిషేధం.

దీపం మాత్రం వెలుగుతోంది.

వినమ్రురాలై చేతులు జోడించి నమస్కరించింది ప్రభాత.

"ఏం కోరుకున్నావు ప్రభాతా?"

ప్రక్కనే నిల్చుని తదేకంగా తననే పరిశీలిస్తున్న మామయ్యకు తన యెదలోని రొద అర్థం అయ్యిందేమోనని తడబాటు చెందింది.

"ఇప్పుడు కాదు"

మసక వెల్తురులో కూడా ఆమె ముఖంలో ప్రతిబింబిస్తున్న మనో-భావాలను వినోదంగా తిలకిస్తూ "ఎప్పుడు చెప్తావు?" అన్నాడు.

గుండెల్లో గుస గుసలాడిన అనుభూతికి వివశురాలవుతూ, "సమయం కలిసొచ్చినప్పుడు." అంది.

కోవెల సంచర్శన ముగిశాక అదే ప్రశ్న రమేష్ విద్యను వేశాడు.

"ఊహు ! నేనేమీ ప్రార్థించలేదు."

"వరాలు వేడని భక్తులున్నారన్న మాట."

"నేను భక్తురాలిని కాను."

"ఇప్పుడే కదా కనులు మూసి ప్రార్థించారు."

"ఫర్ ద సేక్ ఆఫ్ ఫార్మాలిటీ. మనలో చాలా మంది దైవం యందు అచంచల విశ్వాసం గలవారున్నారు. వారు యిలా విగ్రహాలను ఆరాధిస్తూనే వుంటారు. ఇందరిలో నేనొక ప్రత్యేక వ్యక్తిగా గుర్తింపబడటం, యే కొద్దిమందయినా నా ప్రవర్తనకు నొచ్చుకోవడం నాకిష్టంలేదు."

"దేముడంటే మీ వుద్దేశం పురాణాల్లో పేర్కొనబడినవారా లేక అసలు మానవాతీత శక్తి మీదే నమ్మకం లేదా?"

**జరిగిన కథ 10 : అక్కకూతురు రాజ్యలక్ష్మి చనిపోవడంతో ఆమె కూతురు ప్రభాతను తన ఇంట్లోనే ఉంచుకొంటుంది ప్రభావతమ్మ. రామస్వామి, ప్రభావతమ్మల పెద్ద కొడుకు కృష్ణచైతన్య. అతనికి ప్రభాత అంటే అభిమానం. ఆమెను ప్రైవేటుగా మెట్రిక్‌కు కట్టిస్తాడు. కృష్ణచైతన్య తమ్ముడు నందకిశోర్ తనో కన్నడ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్లు అన్నతో చెప్తాడు. కృష్ణచైతన్య, రాధ, ప్రభాతలు సినిమా కెళితే అక్కడ చిన్ననాటి స్నేహితుడు శరత్ కలిసాడు. శరత్, రాధలు ఒకరి పట్ల ఒకరు ఆకర్షితులవుతారు. కృష్ణచైతన్య తన డిపార్టుమెంటు వారంతా అజంతా, ఎల్లోరా వెళుతుంటే తన మేనమామ కొడుకు రమేష్‌ను, ప్రభాతను తనతో కూడ తీసుకెళతాడు. అక్కడ రమేష్, ప్రభాతలకు డా. విద్యను పరిచయం చేస్తాడు కృష్ణచైతన్య.**

"మానవాతీత శక్తిని లేదనను నేనెంత? అయితే ఆ శక్తిని నేను నిర్వచించలేను. ఆ శక్తి ముందు తలవాల్చక తప్పదు. అంతేగానీ, నాలోని బలహీనతలను కప్పిపుచ్చుకోను. వొక రాయినే శక్తి అని నమ్మి నేను పూజించలేను."

"మీరు చెప్పింది కాదనలేను డాక్టర్ విద్యా. కానీ యేకాగ్రత కోసం విగ్రహారాధన అమలులోనికి వచ్చింది."

"అసలు ఆరాధన యెందుకు?"

"ప్రార్థన. ప్రార్థన వలన మనసు నిర్మలంగా వుంటుంది."

"ఆ కొద్దిసేపు మాత్రం. ఆ తరువాత?"

"................."

రమేష్ మాటలు వెతుక్కుంటూ వుండగా విద్య తన అభిప్రాయం వ్యక్తపరిచింది.

"తాత్కాలికమైన మనో విశ్రాంతి కోసం లేదా నిర్మలత్వం కోసం ప్రార్థనలు జరిపి తరువాత మామూలు క్షణికోద్రేకాలకూ లోబడే బదులు యెల్ల వేళలా మనసును స్వచ్ఛంగా వుంచుకునే యేర్పాటు చేయవచ్చును కదా!"

"ప్రార్థన వలన చిత్తశుద్ధితో పాటు యేకాగ్రత పెరుగుతుంది."

"అవును మిష్టర్ రమేష్. ఆ యేకాగ్రత మానసికంగా అంటే యెదురుగా ప్రతిమలు లేకుండా సాధించే ప్రయత్నం యింకా గొప్పది కాదని మీరంటారా?"

అతడు బదులివ్వలేదు. అతి సుకుమారి యైన స్త్రీలో దాగిన మనోబలాన్ని, విశిష్టమైన ఆమె వ్యక్తిత్వాన్నీ అతడు గౌరవించాడు.

అసలే ఆకర్షణీయమైన రూపు ఆమెది. దానికి తోడు విజ్ఞానం చేసిన అలంకరణతో పాటు వ్యక్తిత్వం దిద్దిన మెరుగులు ఆమెను వున్నతాసనం మీద కూర్చోబెడుతున్నాయి.

ఆమె సౌందర్యం అతని కన్నులకు పని కల్పిస్తూ వుంటే, ఆమె మాటలు అతని మనసుకు విశ్రాంతి లేకుండా చేస్తున్నాయి.

ఎత్తైన విగ్రహం, సన్నని నడుము, పసిమిఛాయ, సోగ కన్నులు, సన్నని నాసిక, పలచని పెదాలు , నల్లనిజుత్తు, సామాన్యమైన అలంకరణ, వీటన్నిటికీ మించి ఆమె మోమున యేమిటది? ఆకర్షణ. చల్లని వెన్నెల కలిగించే అద్భుతమైన అనుభూతిని పంచి యివ్వగల ఆకర్షణ ఆమెకెలాదక్కింది? కళ్ళలోని తేజస్సును యెక్కడ నుండీ తెచ్చుకుంది? మనసులో నుండి...... అవును, ఆ ప్రకాశవంతమైన, చల్లని చూపు ఆమె ప్రశాంత మనసుకు ప్రతిబింబం.

ఏతల్లి మోసిన అదృష్టమో ఆమె!

ఆమెకు జన్మనిచ్చి తరించిపోయిన అదృష్టవంతులెవ్వరు?

ఆమె చేయి నందుకుని ధన్యత్వం పొందనున్న పుణ్య పురుషుడెవరు? రమేష్ మరిక ఆలోచించలేక పోయాడు. తానేదో కోరుకుంటున్నానని మాత్రం స్పష్టమైంది అతనికి.

మూడవ రోజు ఔరంగాబాద్ పర్యటన. దేవగిరి కోట, పచంకి మహల్, బాబీకా మక్బరా దర్శించి సాయంత్రానికి బసకు చేరారు. ఇంతవరకూ కార్యక్రమం అంతా సిస్టమాటిక్‌గా నడచింది కానీ తరువాతే గందరగోళం ప్రారంభమైంది. అపురూప శిల్ప కళాసంపదను స్వంతం చేసికున్న అజంతా, ఎల్లోరా దర్శన సమయంలో నూ, చారిత్రక ప్రసిద్ధిగాంచిన దేవగిరి కోట సందర్శనప్పుడు కలుగని సంచలనం షాపింగ్ సమయంలో సంభవించింది. ఆడవాళ్ళకు షాపింగ్ మీద వున్న వుత్సాహం కృష్ణచైతన్యకు యెప్పటికప్పుడు ఆశ్చర్యాన్ని కలిగిస్తూనే వుంటుంది.

ఎవరెవరెక్కడ వున్నారో తెలుసుకోవడం మరీ కష్టంగా వున్న తరుణంలో -

"రమేష్ యేడి?" అన్నాడు కృష్ణచైతన్య చుట్టూ కలయ జూస్తూ.

"బాబాయ్ విద్యా ఆంటీతో మాట్లాడుతూ మరో షాపులోకి వెళ్ళారు."

రమేష్‌లో కలిగిన సంచలనం కృష్ణచైతన్య దృష్టికి రాకుండాపోలేదు. అయినా, అతనిలో యెంత చనువు, స్నేహంవున్నా కృష్ణచైతన్య అతడ్ని యేమీ ప్రశ్నించలేదు. తానా విషయాన్ని తెలుసుకున్నట్లు కూడా మసలడు.

ందుకే అతనికి స్నేహితులు యెక్కువ" అంటాడు నందకిషోర్

గాపింగ్ పూర్తయ్యాక భోజనాలు ముగించుకుని అర్ధరాత్రి కెప్పుడో వచ్చే ్న్ కోసం రెండు గంటలు ముందుగానే స్టేషన్‌కు చేరారు. ఆ సమయం ంతే బస్ వాళ్ళు రామన్న కారణంగా అక్కడ ట్రెయిన్ కొన్ని నిమిషాలు ్రమే ఆగుతుందనీ, జాప్యం లేకుండా ట్రెయిన్ కాచ్ చేయమని మినస్ ృచ్చరిక లాటి ప్రార్ధన చేశాడు. అతడే ఈ ఎక్స్ కర్షన్‌కు సంబంధించిన ్యవహారమంతా చూస్తున్నాడు.

"ఆంటీ యీరోజు కూడా మాతోనే వుంటారా?"

ప్రభాత అమాయకమైన ఆరాధనను ముగ్ధురాలైన విద్య నవ్వుతూ" అలాగేనమ్మా" అంది

మూడు రోజులుగా ఆమె ప్రభాతతో కలసి వుంది. ఈ సమయం ఒక మనిషిని అంచనా వేయడానికి తక్కువే అయినా విద్యకు ప్రభాతకు మామయ్యపై గల ఆరాధనా భావం అర్ధం కావడానికి అట్టే సమయం పట్టలేదు. విద్య నుండి తన మనసును దాచుకునే ప్రయత్నాలేమీ ప్రభాత చెయ్యలేదు కూడాను. ఆమెకు విద్య చాలాకాలం క్రితం విడిపోయి కలుసుకున్న ఆత్మ బంధువులా అనిపించింది.

ట్రెయిన్ వచ్చే వరకూ ఆమె ప్రభాతతో బాతాఖానీ వేసింది.

"ప్రభాతా నువ్వు మధ్యలో చదువెందుకు మానేశావు?"

"నాకు మొదట్లో చదువుమీద శ్రద్ధ లేదు ఆంటీ " నిజం చెప్పేసింది

'మళ్ళీ చదువుకోవాలని యెందుకనుకున్నావు?"

ప్రభాత ముందు చెప్పటానికి తటపటాయించి తరువాత చెప్పెయ్యటానికే నిశ్చయించుకుంది.

"మామయ్యకు .. .. మామయ్యకు చదువంటే యిష్టం "

'మీ మామయ్య కిష్టమైన వన్నీ నీకిష్టమన్నమాట."

ప్రభాత అరక్షణం ఆలోచించి "నాయిష్టాలు కొన్ని వేరే వుంటాయి."

"మీ మామయ్య కిష్టమైతే నువ్వెందుకు చదువుకోవాలి?"

ప్రభాతకి యెక్కువ సమయం పట్టలేదు ఆమె తనని ఆట పట్టిస్తోందని అర్ధం చేసుకోను.



## మౌనవిపంచి

చెప్పు. మీ మామయ్యకు యిష్టమైతే అది చేస్తావా?"

ఆమె ప్రశ్నలు సూటిగా వుండి రెట్టిస్తున్నాయి.

"మామయ్యకు యిష్టం లేని పని మా యింట్లో యెవ్వరూ చెయ్యరు చివరకు తాతయ్య అయినా అంతే."

ఆమె దృష్టిలో మామయ్య యెంత వున్నత స్థానాన్ని ఆక్రమించుకున్నాడో అర్థం చేసికున్న విద్య ఆశ్చర్యపోయింది.

ఈ భూమ్మీద ఒక ప్రాణి మరొక ప్రాణి యిలా ఆరాధించి, అభిమానించే అవకాశం వున్నదా? ఈ అపూర్వమైన ఆరాధనకు మూలం యేమిటోనని ఆమె ఆలోచించింది.

హైద్రాబాదులో దిగాక శెలవు తీసికుంటూ "ఆంటీ మీరొక సారి మా యింటికి రండి" మిమ్మల్ని మా అమ్మమ్మకు పరిచయం చేయాలి" అంది ప్రభాత.

"పూర్వం నేనొకసారి మీ యింటికి వచ్చానమ్మా. మీ అమ్మమ్మగారితో పరిచయం కూడా కలిగింది."

"మీరొచ్చినపుడు నేను లేను. కాబట్టి మీరు మరోసారి రావాలి."

"తప్పకుండా." అని కృష్ణచైతన్యతో "ఐ లైక్ హర్ వెరిమచ్. మీరు ప్రభాతను మా యింటికి తీసుకు రండి" అంది.

"ఓ..... ష్యూర్. ష్యూర్."

"మేము రాకూడదా?"–రమేష్.

"వైనాట్. కానీ మీరు మద్రాసు వెళ్ళిపోతారు కదా!"

"అఫ్‌కోర్స్. మీరు ఆహ్వానిస్తే యెప్పుడైనా, యెక్కడి నుండైనా వచ్చి వాల్తాను."

"థాంక్స్. మీ కెప్పుడూ హృదయ పూర్వక స్వాగతం లభిస్తుంది."

"థాంక్యూ.... థాంక్యూ సోమచ్."

వీడ్కోలు తీసికుని విడిపోయారు.

*　　　*　　　*　　　*

నిజాంబాద్ వెళ్ళాలన్న ఆలోచన రాధకు సుస్తీ చేయడంతో వాయిదా పడింది. ఆ ప్రోగ్రాం వాయిదా పడటం రాధకు మాత్రం చాలా నిరుత్సాహాన్ని కలిగించింది. స్నేహితులంతా, చివరకు అన్నయ్య, ప్రభాత కూడా తలో చోటకు వెళ్ళారు. తను మాత్రమే బంధింప బడింది. ఆ సందర్భంగా కలిగిన అనారోగ్యం మీద చాలా కోపం వచ్చింది ఆమెకు. జ్వరం ఐదారు రోజులకు తగ్గినా, శరీరానికి బలం చేకూరలేదింకా.

"నాకు జ్వరం పూర్తిగా తగ్గింది. నిజాంబాద్ గానీ, యింకెక్కడికైనా గానీ వెళ్లం నాన్నా" అంది.

"తొందరేముందమ్మా. ముందు నువ్వు పూర్తిగా కోలుకోవాలి" అన్నారాయన.

"రాధా నువ్వు యీ సంవత్సరం ఇండియా అంతా హనీమూన్ చేసి వస్తావు. నేను హామీ యిస్తున్నాను" కృష్ణచైతన్య జోక్యం చేసికున్నాడు.

"నా విషయమేమో గానీ నువ్వెళ్ళేదిమాత్రం ఖాయం అన్నయ్యా."

"నిన్ను పంపినాకే నేను వెళ్తాను. నాకామాత్రం బాధ్యత లేదంటావా?"

"ఔనవును. లేకుంటే నావిషయం నువ్వు పూర్తిగా మర్చిపోవచ్చును."

"అభాండాలు వెయ్యకు రాధా. ఆడపిల్లలే పెళ్ళిళ్ళు కాగానే మా యిల్లు, మావారు అంటూ మమ్మల్ని మర్చిపోతారు. జయను చూడు. మా యిల్లు, మా ఆయన, పిల్లలు, మా యిదీ..... మా అదీ.... అంతకు మించి వేరే యేమైనా మాట్లాడుతుందా?"

ఇంతలో శరత్ వచ్చాడు. ఈ మధ్య అతని రాకపోకలు అధికమయ్యాయి. వచ్చినప్పుడల్లా రాకకు యేదో సాకు అతని వద్ద వుంటుంది.

వస్తూనే "రాధ యేమంటూంది" అంటూ వచ్చాడు.

"నేనేమి అనటం లేదు."

"నేనే అంటున్నాను శరత్ . అజంతా, ఎల్లోరా రాలేకపోయినందుకు మహా చికాకు చెందుతోందని, యీ సంవత్సరం నీ భర్తతో వెళ్ళిరా అని."

అలా చెప్తున్న మిత్రుడు తన కళ్ళలోకి పరీక్షగా చూస్తుంటే, దొరికినా పారిపోయె దొంగలా " వ్వాట్. రాధ పెళ్ళి కుదిరిందా? హార్టీ కంగ్రాట్యూ రాధా" అంటూ తప్పించుకున్నాడు.

"చాలా థాంక్సు వాటిని మీవద్దనే అట్టిపెట్టుకోండి."

"అదేమిటి?"

"అవుసరం కలిగి నందుకు."

"అంకుల్ , కృష్ణ నాకు అబద్ధం చెప్పాడా?"

రామస్వామి గారు జవాబివ్వ బోతుండగా ఆయన కొరకు యెవ్వరో వచ్చారని తెలియడంతో ఆయన లేచి డ్రాయింగ్ రూంలోకి వెళ్ళారు.

"నేను నీకు అలా చెప్పలేదని నీకూ తెలుసు శరత్."

వెనుక దొడ్లో నుండి చెట్టునున్న అరటి గెల దింపే ప్రయత్నంలో వున్న రాముా కేకలు వేస్తున్నాడు! "రండి" అని. చెట్టుకు నిచ్చెనవేసి యెక్కాడు కానీ గెల దించడం వాడికి సాధ్యం కాలేదు. చెట్టుక్రింద అమ్మమ్మ, మనుమరాలు పావుగంట నుండీ "గెల దిగుతోంద"ని నిలబడే వున్నారు. చివరకు వాడు "కృష్ణయ్య గారు రాందె లాభం లేదు పిలవండని" ప్రకటించాడు.

వాణ్ని వద్దన్నా యెక్కినందుకు విసుక్కుంటూ"కృష్ణా, రాధా" అని కేక వేసింది.

"త్వరగా రమ్మనండి అమ్మాయిగారూ. నాకిక్కడ బాలెన్స్ కుదరటం లేదు "

ప్రభాత "మామయ్యా. త్వరగా రావాలి" అని వచ్చి పిలవడంతో లేవక తప్పలేదు కృష్ణచైతన్యకు.

"రేపు కోస్తానంటే మీకెందుకు తొందరని" విసుక్కుంటూనే గెల దింపాడు

"పూర్తిగా నయమైందా రాధా?" లోపల శరత్ రాధను ప్రశ్నించాడు.

"ఊఁ!"

"అజంతా, ఎల్లోరా వెళ్ళలేదని బాధగావుందా?" అతని కంఠం మృదువుగా వుంది.

"లేదు."

"అయినా హనీమూన్‌కు వెళ్ళాల్సింది అజంతాకు కాదు."

" ..........."

"కచూరహో చూచి రావాలి."

రాధ బుగ్గలు యెర్రగాకంది పోయాయి కన్నెత్తి అతన్ని చూడలేక పోయింది.

"చాలామంది హనీమూన్ పేరిట కాశ్మీర్, కెరళానో వెళ్తారుగానీ నేనుమాత్రం కచూరహో వెళ్తాను."

"మంచిది. వెళ్ళండి" గొంతు పెగలించుకుని యెట్టకేలకు అంది.

"న్నువ్వు..... నువ్వు రావా రాధా!"

ఊహించని యీ హఠాత్పరిణామానికి ఆమె కలవర చెందింది. ఉద్వేగంలో శరీరం వేడెక్కింది. బదులివ్వలేని అవస్థలో ఆమెను పడవేసి

" నాప్రశ్న అర్థం కాలేదా రాధా?" అన్నాడు.

ఆమె తల వూపింది.

ఆమె జవాబు చెప్పను ప్రయత్నిస్తోంది. మాటలు కంఠం దాటి వెలుపలకు రావడం లేదు. విఫలమౌతున్న ఆమె ప్రయత్నాన్ని కుతూహలంగా గమనిస్తున్నాడు శరత్. వారి యేకాంతాన్ని భంగ పరుస్తూ కృష్ణచైతన్య వచ్చాడు అతని వెనుకే రాముా అరటి గెలను లోనికి తెచ్చాడు

"పెరటి తోట మంచి లాభసాటి అనుకుంటాను కృష్ణా!"

కృష్ణచైతన్యను .చూస్తూనే చటుక్కున లేచి తన గదిలోకి వెళ్ళిపోయింది రాధ.

ఆమె ప్రవర్తనకు ఆశ్చర్య పోతూ" రాధ అలా వెళ్ళిపోతోందేమిటి? మీరు గానీ పోట్లాడుకున్నారా!" అన్నాడు రాధ వెళ్ళిన వైపే చూస్తూ కృష్ణచైతన్య.

"ఇప్పటి వరకూ సరదాగా మాట్లాడింది. రిజల్ట్సు వస్తే మళ్ళా యూనివర్సిటీ చుట్టూ తిరగాలి. ఎన్‌ట్రెన్స్ పరీక్షలకు చదవాలి అంది. పాసైనప్పటి విషయం కదా అంటూ వుండగానే నీవొచ్చావు."

ఎంతో అమాయకంగా, నిజాయితిగా చెప్తున్న అతని మాటల్ని కృష్ణచైతన్య విశ్వసించాడు. కానీ ఒక్కసారి అతడు కనుక రాధపై దృష్టి సారించి వుంటే అతడు సునాయాసంగా ఆమెలో కలిగిన కలవరాన్ని పసికట్టేవాడు. అందుకే రాధ వెళ్ళిపోయింది.

ఆ తరువాత కూడా రాధ బయటకు రాలేదు. ఆమె శరత్ ప్రశ్నను మననం చేసికుంది. నిశ్చంగా, ఎలాటి ఆద్వేగమూ కనపర్చకుండా అతని మనసులోని కోరికను ఎంత చక్కగా విశదపరిచాడు ఆ ప్రశ్న వెనుక దాగిన కాంక్షనూ, మమతనూ అర్థం చేసికున్న కొలదీ ఆమె మనసు మరేదో లోకంలోకి విహంగనలా ఎగిరిపోతోంది.

ఆమె సృష్టించుకున్న జగతిన – చిన్నబూట వున్న తెల్లటి బిన్నీ జార్జెట్ చీర రాధ అందాన్ని ద్విగుణీకృతం చేస్తూ వుంటే, శరత్ ఆమెను రెప్పవెయ్యకుండా చూస్తున్నాడు. సిగ్గుతో కందిపోయిన ఆమె మోమును వింతగా తిలకిస్తూ సమాధానం చెప్పమని కన్నులతోనే వేడుకుంటున్నాడు. ఆమె బలవంతంగా బరువెక్కిన కనులెత్తి అతని చూపులో చూపు కలిపింది. ఆ చూపే అతనికి వెయ్యి మాటలను చెప్ప కోటి కోర్కెలను తెలియచేసింది. అతడు మరేమీ ప్రశ్నించక ఆమె చేయి నందుకున్నాడు ఇద్దరూ....ఏమా రమణీయ శిల్పకావ్యాలు? ఏనాటివా కళాఖండాలు? ఎవరు చెక్కారు? ప్రతి వ్యక్తి జీవితంలో నూ






## మౌనవిపంచి

గుప్తంగా అంతర్లీనమైన శృంగార భావాలను శిలల మధ్య సృష్టించగల శక్తిని ఎవరు ప్రేరేపించారు?

శరత్, రాధ నడుము మీద చేయి వేసి నడిపిస్తున్నాడు. అక్కడక్కడ ఆగి రమ్య శిల్ప దృశ్యాలను తిలకిస్తున్నారు. రాధ కన్నులు మత్తుగా వాలిపోతుంటే అతడు గమ్మత్తుగా చూస్తూ కొంటె మాటలేవో ఆమె చెవిలో చెప్తున్నాడు.

"రాధ" అన్న పిలుపుకు వులికిపాటుతో ఈ లోకంలోకి వచ్చింది. తన చుట్టూ పరికించి, తనను తాను చూచుకుంది. ఎయిర్‌కూలర్ స్పీడ్‌గా తిరుగుతున్నా నుదుట స్వేదబిందువులు అలుముకున్నాయి. శరీరం నును వెచ్చగా వుంది.

ఆమె అన్నయ్య పిలుపుకు బదులివ్వలేదు.

శరత్ ఆశగా ఆమె గది తలుపుకేసి చూశాడు చాలాసేపు. ఆమె రాలేదు.

అతని ముఖం తెల్లగా పాలిపోయింది. నిస్పృహను అణచుకుంటూ "వస్తాను కృష్ణా; రాధకు బాగా కోపం వచ్చినట్లుంది" అంటూ లేచాడు.

ఎప్పుడొచ్చినా ప్రొద్దుపోయే వరకూ ఉండి వెళ్ళే మిత్రుడు అలా హఠాత్తుగా మౌన వదనంతో శెలవు తీసికోవడం అతనికి నచ్చలేదు. రాధ మీద కోపం వచ్చింది. "ఇంకా మనసు ఎదగలేదు" అని సరిపెట్టుకున్నాడు.

★ ★ ★ ★ ★

ఆ మరునాటి మధ్యాహ్నమే హాల్లో ఫోను అదే పనిగా మ్రోగింది. సమీపంలో వున్న ప్రభాత రిసీవ్ చేసికుంది.

"హల్లో"

"నేను శరత్‌ను."

"ఓహో...మీరా!"

"ఎవరు ప్రభాతా?" ఆమెకు చేరువలో కూర్చున్న రాధ వుత్కంఠతో అడిగింది.

ఆగమన్నట్లు రాధకు సైగ చేసి" మామయ్య లేరు" అంది.

"ఎక్కడకు వెళ్ళారు."

"తెలియదు."

"పోనీ యింకెవరున్నారు?"

"అమ్మమ్మ, పిన్నీ."

"రాధను పిలుస్తావా?"

"అలాగే."

రిసీవర్ రాధ చేతికిస్తూ "శరత్ అంకుల్" అంది ఘఠాత్తుగా మారిన రాధ ఫీలింగ్సును గమనిస్తూ.

రాధ తటపటాయిస్తూ కూర్చుంది

"నిన్నే అడిగారు పిన్నీ."

రాధ చెయ్యి చాపి రిసీవర్ అందుకుంది.

"హలో ... నేను.. "

"రాధవు."

"_ "

"ప్రభాత యేంచేస్తోంది."

"ఇక్కడే కూర్చుని పత్రిక చూస్తోంది."

"ఐ. సీ..."

"_ _ _"

"రాధా!"

"ఊఁ"

"నీకు నిన్న బాగా కోపం వచ్చినట్లుంది. ఐయాం వెరీ సారీ."

"_ _ _"

"నాకు చాలా బాధగా వుంది?"

"ఎందుకు?"

"నీకు కోపం వచ్చినందుకు."

"అలా అని ఎందుకనుకోవాలి."

"నా ప్రశ్నకు జవాబియ్యలేదు."

"అన్ని జవాబులూ మాటలలో వ్యక్తంకావు."

"పోనీ ఎలా తెలియ జెయ్యదలిచావు?"

"_ _ _"

"రాధా యీ రోజు రామక్రిష్ణా థియేటరుకు వస్తావా?"

"సారీ."

"నీ యిష్టం చెప్పు."

"ఎనీ బస్ స్టాప్."

"జి. పి. ఒ."

"ఓ. కె."

"కచ్చితంగా ఆరు గంటలకు."

"ష్యూర్."

"అక్కడ కలుద్దాం."

"బై" ఫోన్ పెట్టేసి అరిచేతులకు పట్టిన చెమటను తుడుచుకుంటూ మామూలుగా వుండాలని వ్యర్ధ ప్రయత్నం చేసింది. తమ సంభాషణ మననం చేసుకుని ప్రభాతకు అనుమానం కలిగే ఆస్కారం వున్నదేమోనని తర్కించుకుని అలా యేమీ లేదని నిర్ధారణ చేసుకుని నిశ్చింతగా "పిక్చర్స్ యేమున్నాయో" అనుకుంటూ డెక్కన్ క్రానికల్ చివరి పేజీలో తలదూర్చింది.

నాలుగ్గంటల నుండీ ముస్తాబై బయటకు అడుగుపెట్టిన రాధ అనుకున్న సమయానికన్నా ముందుగానే సంకేత స్థలానికి చేరుకుంది. "ఆరంటే కచ్చితంగా ఆరుగంటలకే రావాలా? కొంచెం ముందు రాకూడదూ?" అని శరత్‌ను విసుక్కుంది.

అన్న సమయానికి అరక్షణమైనా ఆలస్యం చేయలేదు శరత్. అతడు సైగ చేయగానే నిస్సంకోచంగా అతని వెనుక కూర్చుని అతనితో సాగిపోయిన రాధ తమ జంటను వో జత కళ్ళు వెంటాడటాన్ని గమనించలేదు.

ఇంటికి వచ్చినప్పటినుండీ కొడుకు అసహనంగా యెందుకున్నాడో భోదపడలేదు ప్రభావతమ్మకు.

"రాధ ఎక్కడికి వెళ్ళిందమ్మా?"

"కవిత పుట్టిన రోజుట మధ్యాహ్నం రమ్మని ఫోన్ చేస్తే వెళ్ళింది."

అతడు తల పంకించాడు. "అయితే రాధ ప్రోగ్రాం అంతా సీక్రెటన్నమాట అనుకున్నాడు.

"రాధ పెళ్ళి యీ సంవత్సరం చెయ్యాలమ్మా."

"నేనూ అలాగే అనుకుంటునాను."

"నాన్నగారితో మాట్లాడమ్మా."

"ఇప్పుడు నేను క్రొత్తగా మాట్లాడేదేమిటి? రోజూ పోరుతూనే వున్నాను."

"రాధ పెళ్ళి చేసే తరుణం ఆసన్నమైంది. ఆలస్యం అనర్థదాయకం."

"కృష్ణా! నా కడుపున పుట్టిన మొదటి బిడ్డవురా నువ్వు. నీ పెళ్ళి వయసొచ్చి, దాటిపోబోతోంది గూడా. నీ మాట చెప్పవేమిరా?" ఆమె కంఠంలో తొణికిన ఆవేదనను నిర్లక్ష్యపరుస్తూ "నా విషయం తర్వాత చూద్దాం. ముందు రాధ మాట మర్చిపోకండి."

వెనుక దొడ్లోకి వెళ్ళబోతూ "ప్రభా ఖాళీగా వుంటే రా చెట్ల పాదుల వ్యవహారం చూడాలి" అన్నాడు.

క్రమేణా అతడు ప్రశాంతతను చేజిక్కించుకుంటూ వుండగా ప్రభాత అతనికి తోట పనిలో సహకరిస్తూ "మామయ్యా" అంది మౌనాన్ని ఛేదిస్తూ. ఏమిటన్నట్లు చూశాడు

"రాధ పిన్ని..."

"ఊ("

"మరి;...రాధ పిన్ని..."

"చెప్పు."

"రాధ పిన్ని శరత్ అంకుల్ని ప్రేమిస్తోందా?"

కృష్ణచైతన్య నిర్ఘాంతపోయాడు. తాను యింత కాలం చిన్నపిల్లగా భావిస్తున్న యీ పసిడి మొగ్గ విచ్చుకుంటుందా? ఆమె ప్రేమను గూర్చి తలపోస్తోందా? ఆమె మనసు యెదిగి....వూహలు యెగిరి యేవైపు సాగుతున్నాయి.

అతని గాంభీర్యాన్ని మరోలా అర్థం చేసికున్న ప్రభాత చిన్నబుచ్చుకుని "సారి మామయ్యా" అంది.

"ప్రేమంటే ఏమిటి మొద్దూ" అన్నాడు చిర్నవ్వుతో. ఆమె జవాబును తెలుసుకోవాలన్న అతని వుత్కంఠను నిరాశ పరుస్తూ ప్రభాత మౌనందాల్చింది భావాలను భాషలో పెట్టగల నైపుణ్యం ఆమెకు లేదు.

"రాధ ప్రేమిస్తోందని ఎందు కనుకున్నావు?"

శరత్‌ను చూడగానే రాధలో కలిగే నూతన సంచలనాన్ని తాను గుర్తించాననీ, అతని సన్నిధిలో ఆమె పొందే తన్మయత్వం తనకా అభిప్రాయాన్ని కలిగించాయని ప్రభాత అతనితో చెప్పటానికి సంకోచించింది.

తదేకంగా ఆమెనే పరిశీలిస్తూ "చెప్పు ప్రభా" అన్నాడు

"నాకు తెలియదు మామయ్యా"

ఆమె వూహలు యెటు పయనిస్తున్నాయో తెలుసుకోవాలనుకున్న అతనికి నిరాశ ఎదురయ్యింది.

రాత్రి ఎనిమిది దాటిన దగ్గర్నుండి అతనిలో అసహనం, అశాంతి అధికం కాసాగాయి. నిమిషానికో మారు వాచీ చూచుకుంటూ, ఏ పనీ లేకుండా కూర్చున్న అతన్ని చూస్తూ "అవసరం ఐతే తనే ఫోన్ చేస్తానంది" అంటున్న తల్లి వైపు జాలిగా చూశాడు.

చిన్నపిల్ల ప్రభాతకున్న వూహ తల్లికి లేకపోయిందే అని మొదట కోపగించుకున్నా, తరువాత తల్లి మనసు కలాంటి ఆలోచనలు త్వరగా రావులే అని సర్ది చెప్పుకున్నాడు.

"కవిత ఫోన్ నెంబర్ తెల్సుకోవాల్సిందిరా నేను"

అమ్మ ఎంత అమాయకురాలు! కూతురు మీద తల్లికెంత నమ్మకం. ఆ నమ్మకాన్ని ఆమె గానీ వమ్ము చేయదు కదా!

**(ఇంకా ఉంది)**

## కార్టూనిస్టులకు సూచనలు!

- కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితం మీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.
- ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!
- వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- సొంత చిరునామాగల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
- ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీ గాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
- పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సంచిక సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్ల కాగితం మీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జత చేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

సం॥

# యజమాని-భృత్యుడు



## ధర్మపథం

భృత్యుడు తన యజమాని వద్ద కొలువుకు కుదురుకొని జీతం తీసుకుంటూ జీవిస్తూ ఉంటాడు. ఇద్దరి మధ్యా అనుకూల్యం లేకపోతే — ఇద్దరికీ శ్రమగానే ఉంటుంది. యజమాని తన సేవకుని దయతో చూస్తూ, కష్టసుఖాలు గమనించాలి. సేవకుడూ విశ్వాసంతో పని చేస్తూ, యజమానికి గౌరవం ఇవ్వాలి. తిరస్కారభావం ఉండకూడదు. ఏ పనికయినా ముందుకు రావాలి. అట్టి భృత్యుని మీద యజమానికి ఎంతో దయ ఉంటుంది.

ఈ కాలంలో శ్రీమంతులు తమ హోదాకు తగినట్లు కార్లలో ప్రయాణం చేసే రీతిని — మోటారు కారులు లేని కాలంలో సవారీలలో ప్రయాణం చెయ్యడం ఘనంగా భావించేవారు. అది వ్యయ మూలకమయినా ఖర్చుకు వెనుక తీసేవారు కారు. సవారీ మొయ్యడానికి బోయీలు కావాలి. వారికి జీతాలిచ్చి పోషించాలి. అలాగే ఒక గొప్ప భూస్వామి శ్రీమంతుడు కావలసిన చోటికి సవారీలోనే ప్రయాణం చేస్తూ కొందరు వాహకులను పోషిస్తూ ఉండేవాడు. ఆయన ఉత్తముడు; శాంతమూర్తి. సేవకులను అభిమానంగా చూచేవాడు. అతని కుటుంబంలోని వారూ అట్టివారే!

ఆయనకు ఎన్నో పాడిపశువులు ఉండేవి. వాటిలో ఒక దూడ పైని ఆయనకు ఎంతో ప్రేమ. ఒకనాటి తెల్లవారు జామున అది కట్టువిడిపోయి ఎక్కడికో పోయింది. అది తప్పిపోయిన సంగతి తెలిసి, పిచ్చిపట్టినట్లయి, ఆయన దాన్ని వెతకడానికి బయలుదేరాడు. అది చూచి, ఇంట్లోని సేవకులు తమ తమ పనులను సగంలో విడిచిపెట్టి, తామూ వత్సాన్వేషణకు నలువైపులకీ వెళ్ళారు. బోయీలు మాత్రం కదలలేదు. గృహ యజమానురాలు "మీరూ దూడని వెతకడానికి వెళ్ళండి." అన్నది. వారిలో ఒకడు "సవారి మొయ్యడం మా పని; దాన్ని వెతికే పని మాదికాదు" అని నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు. తక్కినవాళ్లు వంత పాడారు.

సేవకులు బాధ్యత తీసుకోవడంవల్ల గృహస్థు తిరిగివచ్చాడు. అతని భార్య బోయీల మాటలను అతనికి తెలియజేసింది. ఆతడు కొంచెం ఆలోచించి, భోజనంచేసి, ఆహార వస్తువులు మూట కట్టి, బోయీలను సవారీ సిద్ధం చెయ్యమన్నాడు. తానందులో కూర్చుని "నేను చెప్పిన దారిలో నడవండి." అని వారిని నడిపించాడు. గమ్యస్థానం చెప్పలేదు.- పన్నెండు గంటలవరకూ కొన్ని మార్గాలలో నడిచి, మరి నడవలేక వారు ఒక చెట్టు కింద వాహనం నిలిపి "ప్రభూ ! మా ప్రాణాలు పోతున్నవి. ఎక్కడికి వెళ్ళాలో చెప్పలేదు. ఇక మేము వెళ్ళలేము" అని దీనంగా చేతులు జోడించి అన్నారు. "దూడను వెదకడం మీ పని కాదుకదా!మీరు చెయ్యవలసిన పనినే చెప్పాను. దూడను వెతకడానికి నేను బయిలుదేరాను" అని ఆయన అనేసరికి అంతా నిర్ఘాంతపోయారు. తామన్నది తప్పే, అని చెంపలు వేసుకున్నారు.

ఆ శ్రీమంతుడు, తాను తెచ్చిన ఆహారం వాళ్లకు పెట్టి, కొంతసేపు విశ్రాంతి తీసుకోమని చెప్పి, తర్వాత ఇంటిముఖం పట్టాడు.

దూడ తనంత తానే ఇంటికి చేరుకున్నది.

(పానుగంటివారి కథ ఆధారంగా)

బులుసు వేంకటరమణయ్య

## ఉత్తమ కవితా సంపుటికి బహుమతి

అమలాపురం సాహితీ మిత్రమండలి 1982-84 సంవత్సరములలో వెలువడిన కవితా సంపుటాలలో. ఉత్తమ కవితా సంపుటానికి రూ. 116/=లు నగదు బహుమతి ఇవ్వ సంకల్పించినది. రచయితలు తమతమ సంపుటాలను మార్చి 10వ తేదీ లోపు పంపాలి ప్రతి పుస్తకము మూడేసి ప్రతులు చొప్పున పంపాలి. ఇతర వివరాలకి నల్లా నరశింహమూర్తి, కార్యదర్శి, సాహితీ మిత్ర మండలి, కాలేజిరోడ్, అమలాపురం-533203 అన్న చిరునామాకి రాయవచ్చు.

# అవీ-ఇవీ-అన్నీ

## యువకులకు వ్యాస రచన పోటీలు

అమరజీవి పొట్టి శ్రీరాములు 84వ జయంత్యుత్సవాలు మద్రాసులో మార్చి 16, 17 తేదీలలో జరుగుతున్నాయి. ఈ 'సందర్భంగానూ, అంతర్జాతీయ యువజన సంవత్సరాన్ని పురస్కరించుకుని 'కులతత్వ నిర్మూలన– యువతరం బాధ్యత' అనే అంశంపై యువతీ యువకులకు తెలుగులో వ్యాస రచన పోటీలు నిర్వహించాలని పొట్టి శ్రీరాములు స్మారక కమిటీ నిర్ణయించింది. మొదటి బహుమతి 500రూ., రెండవ బహుమతి 300 రూ, మూడవ బహుమతి 200 రూ. యివ్వదలివారు. ఆంధ్రప్రదేశ్‌లో నేగాక భారతదేశంలో ఏ రాష్ట్రంలో ఉన్నవారైనా ఈ పోటీలో పాల్గొనవచ్చు. వ్యాసం నిడివి 8 నుంచి 10 అరటావుల మధ్యలో వుండాలి. పేజీకి ఒక పక్కనే రాయాలి. పేజీకి ఇరవై అయిదు పంక్తులు మించకూడదు. బహుమతుల విషయంలో న్యాయమూర్తుల తీర్పే తుది నిర్ణయం. సొంత వ్యాసాలు ప్రత్యేకించి పోటీకోసం రాసినవే పంపాలి. వ్యాసాలు మార్చి 5వ తేదీలోగా అందేలా గౌరవ ప్రధాన కార్యదర్శి, అమరజీవి పొట్టి శ్రీరాములు మెమోరియల్ బిల్డింగ్, 126, రాయపేట హైరోడ్, మైలాపూర్, మద్రాసు-600004. చిరునామాకు పంపాలని గౌరవ ప్రధాన కార్యదర్శి శ్రీ వై. ఎస్. శాస్త్రి తెలియ జేస్తున్నారు. □

# హైదరాబాదు నోట్‌బుక్

## వివేకానందుల పాల గిన్నె:–

వివేకానందులు పంజాబులోని హోషి యార్‌పూర్‌లో ఒక మిత్రుని ఇంట తరచు బస చేసే వారట. బస చేసినప్పుడు ఆయన వాడిన వస్తువులను ఆ ఇంటివారు భద్రపరిచారు. ఆయన వాడిన దండం, పాలగిన్నె, చిరుచాప, పీట మొదలైనవి చాల ఉన్నాయి. ఆయన ఆ ఇంటి ఆవరణలో నాటిన గులాబి మొక్కల సంతతి నేటికీ పూవులు పూస్తూ, ప్రేక్షకుల హృదయాలనూ వికసింప జేస్తూన్నది. ఆయన వాడిన వస్తువులలో పాల గిన్నెను ఆనాటి వివేకానందుల మిత్రుని మనుమడు శ్రీ రతన్‌చంద్‌ధీర్ జనవరి 27వ తేదీ సాయంకాలం రామకృష్ణ మఠానికి బహూకరించారు. రతన్ చంద్‌ధీర్ హైదరాబాదులో పరిశ్రమలు నిర్వహిస్తున్నారు. బహుభాషలు మాట్లాడగలరు. చక్కగా ప్రసంగించగలరు. పెక్కు విశ్వవిద్యాలయం పట్టాలు పొందినవారు. కాని, ఆంగ్లంలో మాట్లాడనని ప్రతిజ్ఞ చేశారు. ఆంగ్లేయుల భాషవల్ల దేశం బానిస అయిందని ఆయన విశ్వాసం. ప్రపంచంలో పెక్కు దేశాలవారిని బానిసలుగాచేసిన వారి భాషలో మాట్లాడరాదని ఆయన ప్రతిజ్ఞ చేశారు, ఏనాడో. దేశం స్వతంత్రమై, ప్రపంచంలో ఆంగ్లేయుల ప్రాభవం తగ్గినా ఆయన ప్రతిజ్ఞను విడనాడలేదు. శ్రీ ధీర్ ఆనాటి గలాబీ సంతతి పూవులతో వివేకానందుల పాల గిన్నెను బహూకరించారు.ఈ సందర్భంలో ఆయన ఒక చిన్న సంఘటనను తెలిపారు. ఆయన నాయనమ్మ పూర్వాచారపరాయణురాలు. వివేకానందుల ఎడల ఎంతో గౌరవంతో మెలిగేది. కాని ఒకమారు ఆమెకు కోపం కలిగించే ఒక సంఘటన జరిగింది. ఆ ఇంట్లో మరుగుదొడ్లను ఊడ్చే పాకీది వివేకానందులను తన ఇంటికి విందుకు పిలిచింది. వివేకానందులు అంగీకరించి విందు భోజనం చేసి వచ్చారు. నాన్నమ్మ మండిపడింది. ఇంత పెద్ద స్వాములవారు భంగీదాని ఇంట్లో అన్నం తినడమా? ఆమె ఆయనను గడప దాటి ఇంట్లో అడుగుపెట్టనివ్వలేదు. ఆయన అరుగుమీదే చతికిలబడ్డారు. ఆమె మిత్రుని భార్య. మనస్సు నొప్పించకుండా మనస్సు మార్చాలి. ఆలోచించారు. దుకాణానికి వెళ్ళి ఒక గజం తెల్ల గుడ్డ తెచ్చారు. అరుగుపై పరిచారు. ఆమెను పిలిచారు. ఆమెకు ఆ గుడ్డను చూపి ఏమిటని ప్రశ్నించారు. ఆమె తెల్లగుడ్డ అని జవాబు చెప్పింది. దానిని ఆయన పీలికలుచేసి రంగులలో అద్ది ఆమెకు చూపారు. గుడ్డ ఒకటేనని, రంగులు వేరని, మూలస్వరూపమైన ఆత్మ, లేక మానవత్వం ఒక్కటేనని, వర్ణభేదాలు మనం సృష్టించుకొన్నవని ఆమెకు వివరించారు. ఆమెకు నచ్చజెప్పడానికి జరిగిన ఈ తతంగమంతా దాదాపు మూడు గంటలు పట్టిందట.

ఇంటివాళ్ళూ, ఇరుగు పొరుగూ ఈ నాటకాన్ని సరదాగా చూచారట. ఈ కథ చెప్పి శ్రీ ధీర్ "ఇలాటివి ఎన్నో సంఘటనలు జరిగాయట. వీటిని మా నాన్న గారు మాకు చెబుతూ ఉండేవారు." అన్నారు. ఈ సమావేశానికి స్వామి జితాత్మానంద అధ్యక్షత వహించారు. ఆయన తమ ప్రసంగంలో, భారత దేశంలో 1885వ సంవత్సరం మహత్తరమైందని, వివేకానందులు భారత దేశం తల ఎత్తుకొనేటట్లు చేసిన సంవత్సరమని, ఆ ఆత్మాభిమాన సంవత్సరం ఈ సంవత్సరం శతజయంతి చేసుకుంటున్నదని అన్నారు. ప్రపంచానికి భారతీయ వేదాంతమే శరణ్యం కాగల సమయం ఆసన్నమయిందని ఆయన అన్నారు. నేడు విశ్వవిద్యాలయాలలో ఎన్నో రాజకీయ సిద్ధాంతాలు, ఇజాలు బోధిస్తున్నారని, శాంతికి ఆలవాలమూ, వివిధ రాజనీతిభరితమూ అయిన భారత శాంతిపర్వాన్ని బోధించడంలేదని ఆయన విచారం ప్రకటించారు.

## మంచి సలహా:–

కొన్ని సంవత్సరాల క్రితం ఒక మహాసభలో ఒక ఉత్తర కొరియా విద్వాంసుని పరిచయ భాగ్యం లభించింది. ఆయన అక్కడ ఒక విశ్వ విద్యాలయంలో సంస్కృతాచార్యుడు. మేఘసందేశానికి సంస్కృతంలో ఒక వ్యాఖ్య కూడా వ్రాశాడు. ఆ సభలో ఆయన ధోరణి నాకు ఆశ్చర్యం కలిగించింది. విదేశాల వారితోను, మన దేశంలోని పలు ప్రాంతాల వారితోను వారి వారి భాషలలో మాట్లాడేవాడు. ఇన్ని భాషలు ఎలా నేర్చారు?– అనడిగాను. మనఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః– అని జవాబిచ్చాడు. ఇంగ్లీషును అమెరికన్ లాంగ్వేజ్ అనేవాడు. ఎందుకు?– అనడిగాను. సామ్రాజ్యవాదులయిన ఆంగ్లేయులంటే నాకు పడదు – అనే వాడు. ఆయనను అందరూ తమ వాడినిగా చూచేవారు, తమ తమ భాషలలో మాట్లాడుతున్నందుకు. భాష పరాయివాడిని ఆత్మీయుణ్ని చేస్తుంది. స్కాండినేవియన్ దేశాల వారికి పుట్టుకతోనే నాల్గయిదు భాషలు సులభంగా వస్తాయి. మనదేశంలో సులభంగా ఇతర భాషలు నేర్చుకొనే ఆసక్తి తమిళ కేరళులకు ఉన్నంత మరొకరికి లేదనుకుంటాను. వారు మన రాష్ట్రానికి వచ్చి మూడు నెలల్లో ముచ్చటగా మాట్లాడగలరు. త్రిభాషా సూత్రం ఈ విషయంలో కొంత మేలు కలిగిస్తున్నా, మనం సాధ్యమయినంత ఎక్కువ భాషలు నేర్చుకుంటే, మనస్సు విశాలం కావడం మాత్రమేకాక, దేశ సమైక్య సమగ్రతలుకూడ పదిల మవుతాయి. అధికార భాషా సంఘం అధ్యక్షులు, మిత్రులు డాక్టర్ నారాయణరెడ్డి మన నగరానికి వచ్చిన వివిధ రాష్ట్రాల ఉపాధ్యాయులకు జనవరి 31న ఇచ్చిన సలహా ఎంతో సముచితం. జాతీయ సమగ్రతకు, వివిధ ప్రాంతాల ప్రజల మధ్య సదవగాహన విస్తరణకు బహు భాషా జ్ఞానం చాల తోడ్పడు తుందని ఆయన అన్న మాటలు సహృదయులుపాటించడం అవసరం.

ఇటీవల విజయవాడ కల్చరల్ క్లబ్ ఆధ్వర్యాన "నవ జనార్దనం" నృత్యాన్ని ప్రదర్శించిన డాక్టర్ నటరాజ రామకృష్ణ శిష్యురాలు బేబి సునీత



## ఉపశ్రుతి:–

తాతా, టి. వి.లో గేదెల అభివృద్ధికి డబ్బు అని ఒకరు చెప్పారే, మన ఇంటి ముందున్న గేదెలకు కూడా డబ్బిస్తారా?– అనడిగాడు మనుమడు ఉదయాన చక్రవర్తి. గేదెల అభివృద్ధి కాదు బాబూ. పేదల అభివృద్ధి అనడానికి మారు గేదెల అభివృద్ధి అని పొరపాటుగా చదివారు ఎవరో – అన్నారు టి. వి. వార్త విన్న ఒకరు.

సిద్ధాంతిగారి చిరునామా:–
శ్రీ వేమూరి రామమూర్తి సిద్ధాంతిగారు,
పురుషోత్తపిల్లి పోస్టు,
వయా నిడుదవోలు, తూర్పు గోదావరి జిల్లా.
(ఆం.ప్ర.)

–తిరుమల రామచంద్ర

*Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna.*

# పీర్‌లెస్ ఎలా మీకు 100% భద్రతకై హామీ ఇస్తుంది?

ఆ తల్లికి, జీవనము కొఱకు ఇక ముందు శ్రమించలేని ఆ మనిషికి, భవిష్యత్తంతా ముందున్న ఆ కుఱ్ఱవానికి—మా అందరి అన్నదమ్ములకి చిన్న రూపంలో, పీర్‌లెస్ పూర్తి సంరక్షణ యొక్క చిహ్నముగా ఎల్లప్పుడు నిలచినది. కంపెనీ యొక్క అద్వితీయమైన సాంఘిక శ్రేయస్సు పథకమే ఈ రక్షణమునకు పునాదిరాయి.

ఇది ఎలా సంభవమో, మీరు చూడండి

100% భద్రత కోసం సర్టిఫికెట్ దారు సొమ్ములోని ప్రతి పైసా పీర్‌లెస్‌చే ప్రభుత్వం సంరక్షణలో జి.పి. నోట్స్ మరియు జాతీయం చేయబడ్డ బ్యాంకుల్లో ఫిక్సెడ్ డిపాజిట్లలోనూ ఉంచబడుతుంది. ఈ సొమ్ము సర్టిఫికెట్ దార్లకు చెల్లించేందుకే గాని, ఇతరత్రా దేనికీ ఉపయోగించేందుకు పీర్‌లెస్‌కు అనుమతి లేదు. కనుకనే పీర్‌లెస్ ద్వారా పొదుపు చేసే అల్పస్తోమత గల వ్యక్తిపట్ల భద్రత సంపూర్ణమై వుంటుంది.

భారత దేశంలో ఏ ఇతర బ్యాంకింగ్ చెయ్యని పొదుపు కంపెనీ ఈ రకమైన సంపూర్ణ భద్రతను సమకూర్చలేదు. అదే పీర్‌లెస్‌కూ తక్కిన వాటికీ గల తేడా!

పీర్‌లెస్ సర్వదా సాధారణ వ్యక్తి శ్రేయస్సుకై పాటుపడు తుందనడదానికి ఇది మరో ఉదాహరణము.




భారత దేశంలో బ్యాంకింగ్ చెయ్యని పొదుపు కంపెనీలలో మిగుల పెద్ద సంస్థ.

## ది పీర్‌లెస్ జెనరల్ ఫైనాన్స్ అండ్ ఇన్‌వెస్ట్‌మెంట్ కంపెనీ లిమిటెడ్

రిజిస్టర్డ్ ఆఫీస్ : పీర్‌లెస్ భవన్, 3 ఎస్ప్లనేడ్ ఈస్ట్, కలకత్తా–700 069

మొత్తం రూ. 500 కోట్లు మించిన ఆస్తులు.

PGI-5443A1